అందరికి మా దీపావళి శుభాకాంక్షలు!



దీపావళికి



# రాణి

వారి సరికొత్త డిజైన్లు

**వనిత, అనిత, బబిత-అన్ని** రంగులలోనూ లభిస్తాయి. ఇవేగాక కాంచీపురం, ఆరణి, ధర్మవరం, బనారస్ పట్టుచీరలు, అన్ని రకాల మిల్లు చీరలు వాటికి మేచ్ అయ్యే చోళీలు సరసమైన ధరలకు లభిస్తాయి.

## రాణీ'స్ సిల్క్ పారడైజ్

(ఏర్‌కండిషన్డ్ షో రూమ్)

"జైన్ భవన్"

(ఆంధ్రా బ్యాంక్ ఎదురుగా)

92/3, పాండీబజార్

టి. నగర్, మద్రాసు-600017

'రాణి' వారి పొదుపు పథకంలో చేరి లాభం పొందండి.

పండుగ రోజులలో
శుభ సందర్భాలలో ధరించడానికి
శారదాస్‌వారి కొత్త డిజైన్లు





మధుమాలిని

సుభద్ర



పట్టు, తక్కిన
రకరకాల వస్త్రాలకు

# శారదాస్

(పెళ్లిళ్ల పట్టు చీరలకు ప్రసిద్ధి గడించిన సంస్థ)

N. S. B. రోడ్
తిరుచ్చి-620 002 ఫోన్ : 27077

ధన్ బిల్డింగ్ మవుంట్‌రోడ్
మద్రాసు-600 002 ఫోన్ : 87177




మీకు యివ్వబడిన డిజైన్ ట్రేస్ తీసి, చుట్టూ చక్కగా కుట్టబడి, నలుచదరంగా (35 సెం.మీ. x 35 సెం.మీ) వున్న గుడ్డపై కేమెల్ క్రైలిన్ రంగులతో ఆ డిజైన్‌కు రంగులు వేయండి. మీరు వేసే రంగులు వీలయినంత లేతగా వుండాలి. అందుకు కేమెల్ క్రైలిన్ మీడియమ్‌తో రంగులను పలుచన చేసుకోవచ్చు. పోటీ చేసే ప్రతి ఒక్కరూ 3 ఎంట్రీలకన్న ఎక్కువ పంపరాదు.

**బహుమతులు : రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- ఇవే గాకుండా 10 మెరిట్ సర్టిఫికెట్‌లు**

మీరు రంగులు వేసిన ఎంట్రీలను ఈ క్రింది ఎడ్రసుకు పంపండి:

పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్,

**కేమ్లిన్ ప్రైవేట్ లిమిటెడ్,** ఆర్ట్ మెటీరియల్ డివిజన్, జె.బి. నగర్, బొంబాయి 400 059

పేరు, ఎడ్రసు వ్రాసిన కవర్‌ను పోస్టేజితోసహా ఎంట్రీతోపాటు పంపితే పోటీ చేసే ప్రతి ఒక్కరికీ ఒక ట్రాన్స్‌ఫర్ పంపబడుతుంది.

మీ ఎంట్రీతో జతపరిచే 'ట్యాగ్'పై మీ పేరు, చిరునామా ఇంగ్లీషులో వ్రాయండి. మీ ఎంట్రీ తిరిగి పంపబడదు.

**ఎంట్రీలు పంపవలసిన ఆఖరు తేది : 15-11-1976**

Vision 4

# వనిత

స్త్రీ జన పక్ష పత్రిక

సంపుటి: 2 సంచిక: 8

అక్టోబర్ పదిహేను: 1976

విడి ప్రతి: రూపాయిన్నర

సం॥ర చందా: ఇరవైనాలుగు రూపాయిలు

శ్రీలంక: 0.97 సెంట్స్

మలేసియా: 65 సెంట్స్

చిరునామా:

చందమామ బిల్డింగ్స్

మద్రాసు-600 026


ముఖ చిత్రం:

దీపావళి శోభ

వర్ణచిత్రం: కె. ఆర్. వి. శక్తి

ఈ సంచికలోని 'నిప్పులేని పొగ' (25వ పేజీ) కథా రచయిత్రి శ్రీమతి కంచి రమాదేవి—ప్రముఖ కథా రచయిత శ్రీ కె.ఆర్.కె. మోహన్ సతీమణి. ప్రస్తుతం హైద్రాబాదులో ఉంటున్నారు.

'70లో రచయిత్రులను ఉద్దేశించి ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ నిర్వహించిన బాల సాహిత్యం పోటీలలో శ్రీమతి రమాదేవి రాసిన 'అనంతంలో అంతం' అన్న రచనకు ఉత్తమ బహుమతి లభించింది. '71లో ఈమె రాసిన 'ప్రమాణం' అన్న కథకు 'జాగృతి' దీపావళి కథల పోటీలో ప్రథమ బహుమతి లభించింది. తరచుగా కథలు, కవితలూ రాస్తుంటారు.



## 'వనిత' దీపావళి నవలల పోటీ

తొలి బహుమతి రూ. 3000 పొందిన నవల

పొన్నలూరు పద్మావతి

రాసిన

# రాధ

రెండవ బహుమతి రూ. 2,500 పొందిన నవల

పెదపూడి రాజ్యలక్ష్మీదేవి

రాసిన

# తెల్లవారని రాత్రి

దీపావళికి నవలల పోటీని పెట్టినట్టుగా ప్రకటించగానే, చాలామంది రచయిత్రులు తమ రచనలను పంపారు. వీళ్ళలో ఎక్కువ మంది కొత్త రచయిత్రులు కావడం—ఒక విశేషం. అయితే, పాటించవలసిన చిన్న నిబంధనలను చాలామంది రచయిత్రులు పాటించలేదు – ముఖ్యంగా ఇతివృత్తంలోనూ పేజీల సంఖ్యలోనూ. మొత్తం మీద వచ్చిన నవలలలో బాగున్నవి - రెండే రెండు అని న్యాయనిర్ణేతలు అభిప్రాయపడ్డారు. ఆ రెండు నవలల్లోనే ప్రథమ, ద్వితీయ స్థానాలను ఇవ్వడం జరిగింది. మూడో బహుమతికి గాని, ప్రత్యేక బహుమతికిగాని అర్హమైన నవలలు కనిపించనందువల్ల ఆ బహుమతులు ఇవ్వడం లేదు. అందుకు విచారిస్తున్నాము.

ఈ సంచిక నుంచి "రాధ"ను సశేష నవలగా ఆరంభిస్తున్నాము. ఇది పూర్తి కాగానే—"తెల్లవారని రాత్రి"ని ఆరంభిస్తాము. ఇవి పాఠకులకు ఉత్సాహం కలిగించగలవని నమ్ముతున్నాము. పోటీలో పాల్గొన్న రచయిత్రులందరికీ కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాము. [వ. సం]

వచ్చే సంచికలో

ముఖ చిత్రం:

'గన్‌షాట్' షూటింగ్‌లో ఏకైక వనితా నిపుణురాలు

భువనేశ్వరీ కుమారి

ఒక కథ:

కథ మారింది

(విమలారామం)

వర్ణచిత్రాలతో వ్యాసం:

వైర్‌బాగ్ చెయ్యడం

ప్రత్యేక వ్యాసం:

"అందరూ వనితలే" కలిసి తయారు చేస్తున్న తొలి హిందీ చిత్రం గురించి....

దీపావళికి

# నాలుగు తీపి వంటకాలు

దీపావళి పండుగ వస్తే బాణా సంచా కాల్చడం ఎంత ముఖ్యమో పిండి వంటలు చేసుకోవడమూ అంతే ముఖ్యమంటారు చాలామంది గృహిణులు. పిండి వంటలలోనూ ముఖ్యంగా తీపి పదార్థాలు చెయ్యడానికి ప్రాముఖ్యం ఇస్తారు. ఆ ప్రాముఖ్యాన్ని పురస్కరించుకుని ఇక్కడ-ఉత్తర భారత దేశస్థులు చేసుకునే నాలుగు రకాల స్వీట్స్ గురించి తెలియజేస్తున్నాము. ఈ వంటకాలు కొన్ని మనలో కొందరికి తెలిసే ఉండవచ్చు; అయినా కొన్ని తేడాలు కనిపిస్తాయి. ఈ స్వీట్స్‌లో కనిపించే సామ్యాలనూ, తేడాలనూ రుచి చూడవలసిందిగా వనిత పాఠకులను కోరుతున్నాము.

## ఖోవా కేక్

ఖోవా కేక్ చెయ్యడానికి రెండు లీటర్ల బర్రె పాలు, బాగా పొడిచేసిన చక్కెర 115 గ్రాములూ, $\frac{1}{4}$ టీ స్పూను సిట్రిక్ ఆసిడ్ (లేదా టార్టారిక్ ఆసిడ్), 50 గ్రాముల సారపప్పు కావాలి.

ఇవన్నీ సిద్ధం చేసుకున్నాక మొదట—దాదాపు ఆరంగుళాల చుట్టుకొలతతో కాస్త లోతుగా ఉన్న శుభ్రమైన పాత్ర ఒకటి తీసుకుని దానిలోపలి అంచులకు నెయ్యిపూసి ఉంచుకోవాలి.

తర్వాత విడిగా మరోపాత్రలో పాలుతీసుకుని కాచాలి. పాలు బాగా మరుగుతున్నప్పుడు అందులో ఒక్కసారిగా సిట్రిక్ ఆసిడ్ స్ఫటికాలు కొన్ని వెయ్యాలి. అలావేసి పాలు విరిగిపోయేదాకా కలియబెట్టాలి. (అయితే పాలు పూర్తిగా విరిగిపోకుండా జాగ్రత్తపడాలి).

అలా పాలు చిక్కగా తయారయ్యేంత వరకూ కలియబెడుతూనే ఉండాలి. పాలు బాగా చిక్కబడి పొడిగా ఉన్నప్పుడు ముందుగానే పొడి చేసి ఉంచుకున్న చక్కెరను అందులో కలపాలి.

ఖోవాలోని ద్రవమంతా ఇగిరిపోయాక మిగిలిన దాన్ని వెనువెంటనే, ముందుగా నెయ్యిపూసి సిద్ధం చేసుకున్న పాత్రలో పోసి వెంటనే మూత పెట్టాలి.

అలా మూతపెట్టి ఆరోజు రాత్రికి అలా వదిలెయ్యాలి. ఆ మర్నాడు ఆ పాత్రలోని ఖోవాను ఒక కత్తితో నెమ్మదిగా వదులుచేసి ఆ తర్వాత పాత్రను కొద్దిగా వెచ్చబెట్టి ఒక శుభ్రమైన పళ్ళెం మీద జాగ్రత్తగా బోర్లించాలి.

అలా బోర్లించిన ఖోవామీద అందంగా సారపప్పుగానీ, సారపప్పు ముక్కలుగానీ వేసి అలంకరిస్తే ఖోవా కేక్ తినడానికే కాక చూడడానికి కూడా బావుంటుంది.

## బేసన్ లడ్డు

బేసన్ లడ్డు చెయ్యడం ఎలా?

దాదాపు 900 గ్రాముల (అంటే 2 పవున్లు) సెనగ పిండి (దీన్నే హిందీలో బేసన్ అంటారు), బాగా పొడిగాచేసిన చక్కెర 700 గ్రాములు (దాదాపు $1\frac{1}{2}$ పవున్లు), కాస్త ఏలక్కాయలు, జీడిపప్పు, పిస్తాపప్పు, నెయ్యి సిద్ధం చేసుకోవాలి.

బాణట్లో కొద్దిగా నెయ్యిగాని వనస్పతిగాని వేసి అందులో సెనగ పిండిని కొద్ది కొద్దిగా పోసి వేయించాలి. పిండి గోధుమ రంగులోకి వచ్చేదాకా అలా వేయించి, తీసి విడిగా ఉంచాలి.

ముందుగానే ఏలకులను పొడిచేసి పెట్టుకోవాలి. అలాగే జీడిపప్పునూ, పిస్తాపప్పునూ ముక్కలు చేసి ఉంచుకోవాలి.

వేయించిన పిండికి ఏలకుల పొడీ, ముక్కలు చేసి ఉంచుకున్న జీడిపప్పూ, పిస్తాపప్పూ కలపాలి. అలాగే చక్కెర కూడా కలపాలి.

ఇలా వేయించిన సెనగపిండికి ఇవన్నీ కలిపి పిండి వేడిగా ఉండగానే లడ్డులు పట్టాలి.

## రాబర్ఢీ

పాలు 1200 మిల్లీమీటర్లు (2 పైంట్లు), చక్కెర 57 గ్రాములు, పన్నీరు ఒక టీస్పూను, ఏలకులపొడి ఒక టీస్పూను, నాలుగైదు బాదం పప్పులూ పిస్తాపప్పులూ సిద్ధం చేసుకుంటే రాబర్ఢీ (దీన్ని రాబ్రీ అని కూడా అంటారు) చెయ్యడం సులభమే.

పాలను ఒక శుభ్రమైన పాత్రలో పోసి సన్నని సెగ మీద కనీసం రెండు గంటలసేపు కాచాలి. పాలు కాగుతున్నప్పుడు దాన్ని అడపాదడపా ఒక శుభ్రమైన గరిటెతో కలియబెడుతూ మీగడ పాత్ర అంచులవెంబడి పేరుకునేలా చెయ్యాలి.

అలా కాగుతున్న పాలలో చక్కెరవేసి పాలు మొదట తీసుకున్న కొలతలో పావు భాగానికి తగ్గిపోయేదాకా అలా కలియబెడుతూ ఉండాలి. పాత్ర అంచుల వెంబడి పేరుకున్న మీగడను మళ్ళీ పాలలో కలపాలి.

పాలు మొదట తీసుకున్న కొలతలో $\frac{1}{4}$ వంతుకు తగ్గిపోయేటప్పటికి అందులో పన్నీరు కలిపి ఆ పాత్రను స్టవ్‌మీద నుంచి దించాలి. ఆ తర్వాత దాన్ని చల్లబడనివ్వాలి. ఒక పళ్ళాన్ని తీసుకుని ఈ కాచిన మిశ్రమాన్ని అందులో పోసి—మిశ్రమం పళ్ళెం మీద సమంగా ఉండేలా చూసుకోవాలి. అలా పళ్ళెంలో అమర్చిన రాబర్ఢీ మీద బాదం పప్పు ముక్కలూ, పిస్తా పప్పు ముక్కలూ

అక్కడక్కడా అమర్చి దానిమీద ఏలకుల పొడి చల్లితే చాలు – రాబర్ఢీ సిద్ధమైనట్టే.

రాబర్ఢీని వేడిగానో, చల్లగానో కూడా తిన వచ్చు. దాన్ని విడిగా తిన్నా, పూరీలతో కలిపి తిన్నా కూడా బావుంటుంది.

మాల్పురాలు

మాల్పురాలు చెయ్యడానికి దాదాపు 340 గ్రాముల మైదా, 340 గ్రాముల చక్కెర, ½ టీ స్పూను ఏలకుల పొడి, 1200 మిల్లీలీటర్ల (2 పైంట్ల) పెరుగు, చిటికెడు కేసరి పొడి, నెయ్యి అవసరం.

ఇవన్నీ సమకూర్చుకున్నాక మైదా, రవ, చక్కెర, ఏలకుల పొడి, పెరుగు, కేసరి పొడి, నెయ్యి అన్నిటినీ ఒక శుభ్రమైన పాత్రలో పోసి కలిపి గట్టిపిండి తయారు చేసుకోవాలి. అలా తయారు చేశాక ఆ పిండి మీద మూతబెట్టి రాత్రంతా అలాగే ఉంచెయ్యాలి. మరుసటి రోజు ఆ పిండి మీది మూత తీసి అర కప్పు గోధుమ రవవేసి బాగా కలపాలి.

ఒక బాణలిని స్టవ్ మీద ఉంచి అందులో కావలసినంత నెయ్యిగానీ వనస్పతిగానీ వేసి కాచాలి. సిద్ధం చేసుకున్న మాల్పురాల పిండిని ఒక టేబులు స్పూనెడు తీసుకొని దాన్ని చప్పటగా గుండ్రంగా గారెలా తట్టి బాణట్లోవేసి వేయించాలి. ఇలా ప్రతిసారీ రెండేసి మాల్పురాలు వేయించాలి.

మాల్పురాల అంచులు గోధుమ వన్నెలోకి మారుతున్నప్పుడు వాటిని గరిటెతో తిప్పి అవతలి వైపు కూడా బాగా వేగేలా చెయ్యాలి. బాగా వేగాక వాటికి అంటిన నేతిని (లేదా వనస్పతిని) బాణట్లో బాగా ఓడ్చి, వాటిని బయటికి తియ్యాలి. ఇలా బయటికి తీసిన మాల్పురాలను చల్లార్చి ఆ తర్వాత వాటిని తింటే బావుంటుంది.

మాల్పురాలు బాగా వచ్చాయా లేదా తెలుసుకోవడం ఎలా? తింటున్నప్పుడు వాటి అంచులు కరకరలాడుతూ ఉండి వాటి మధ్య భాగం మెత్తగా ఉంటే–మాల్పురాలు బాగా కుదిరినట్టు లెక్క!
*



# సందేహాలు సమాధానాలు

ఛాయా ఆర్య

**ఎస్. మణి, సికింద్రాబాదు**

**నా పెదవులు చలికాలంలోనే కాక వేసవికాలంలో కూడా ఎప్పుడూ పగిలిపోతూ వుంటాయి. పెదవులు పగలకుండా ఉండాలంటే ఏం చేయాలి?**

చలివల్ల కాని, ఎండవల్ల కాని పెదవులు పగిలితే— కాస్త ఆముదం తీసుకుని – అప్పుడప్పుడూ పెదవులపై రుద్దుతూ వుండండి; అదే మీ సమస్యకు పరిష్కారం।

**శుభ, హనుమకొండ**

**పెదాలు, చేతులు మొదలైన భాగాలపై వికారంగా పెరిగే వెంట్రుకలను తీసివేయడానికి 'ఎలక్ట్రాలిసిస్' పద్ధతి కాకుండా - 'బ్లీచింగ్,' 'వాక్సింగ్' అనే మరో రెండు పద్ధతులు కూడా ఉన్నాయని విన్నాను. వాటిని గురించి వివరంగా చెబుతారా?**

'బ్లీచింగ్' పద్ధతివల్ల వెంట్రుకలను తొలగించడం వీలుకాకపోయినా, ఆ వెంట్రుకల రంగు తగ్గిపోవడం, ఆ విధంగా అవి శరీరంపై ఉన్నట్లు కనిపించకపోవడం జరుగుతుంది. 'వాక్సింగ్' పద్ధతిని చైనాదేశంలో మొదట కనిపెట్టారు. ఈ పద్ధతివల్ల చాలా ఉపయోగం వుంది. వెంట్రుకలను తొలగించడం కోసమే ప్రత్యేకంగా తయారు చేసిన ఈ వాక్స్ తీసుకుని – ఎక్కడైతే వెంట్రుకలను తొలగించాలనుకుంటున్నారో— అక్కడ పైన రాసుకోవాలి. తర్వాత ఒక శుభ్రమైన గుడ్డను ఆ వాక్సు పైన వేసి, బాగా అదిమి ఒక్కసారిగా ఆ వాక్సును గుడ్డతోసహా లాగివేయాలి. వాక్సుతోపాటే వెంట్రుకలూ వచ్చేస్తాయి. ఇలా నెలకు ఒకటి రెండుసార్లు చేస్తూ వస్తుంటే—ఆయా ప్రాంతాలలో వెంట్రుకలు రావడం క్రమక్రమంగా తగ్గిపోతుంది.

**యక్కల లక్ష్మి, గుంటూరు**

**ఈనాడు చర్మ సౌందర్యానికి ఎన్నెన్నో ఆధునికమైన క్రీమ్సు, లోషన్స్ ప్రచారంలో ఉన్నాయి. ఆరోగ్య దృష్ట్యా వీటిని ఉపయోగించడం మంచిదేనంటారా?**

వాటిని ఉపయోగించడంవల్ల ఆరోగ్యానికి నష్టం ఏమీ ఉండదుకానీ మొదట మీ చర్మానికి తగిన వాటినే వాడుతున్నారా లేదా అన్న విషయాన్ని మీరు గమనించాలి. సరైన ఫలితాలను బేరీజు వేసుకుని చూసుకోకుండా ఇష్టం వచ్చినట్లుగా సౌందర్య సాధనాలను వాడటంలో ప్రయోజనం ఏమీ వుండదు. మరో విషయం: వాటిని వాడేటప్పుడు మీ వయసును కూడా దృష్టిలో పెట్టుకోవాలి. 15 నుంచి 25 సంవత్సరాల వయసున్న వనితలు వివిధ సౌందర్య సాధనాలను ఉపయోగించవలసి వుంటుంది; అలాగే 25 పైబడ్డ వారు ఎక్కువ చల్లదనం కలిగించే విటమిన్లుగల క్రీములను వాడవలసి వుంటుంది. కాబట్టి ఈ విషయాలను దృష్టిలో పెట్టుకుని సౌందర్య సాధనాలను ఉపయోగించాలి.

**జి. ఇందిర, కర్నూలు**

**నా పాదాలు, అరికాళ్ళు చుట్టూ పగుళ్ళు ఏర్పడ్డాయి. అవి ఎండిపోయి, చాలా అసహ్యంగా తయారయ్యాయి. ఆ పగుళ్ళకు తగిలి, చీరలు కూడా పాడవుతున్నాయి. అరికాళ్ళు, అరిచేతులు మృదువుగా ఉండాలంటే ఏం చేయాలంటారు?**

ముఖ సౌందర్యంపట్ల ఎంత శ్రద్ధ చూపుతామో, అంతే శ్రద్ధ - పాదాలూ, చేతులపట్ల కూడా చూపాలి. చాలామంది వనితలు ఈ విషయంలో అశ్రద్ధ చూపుతూవుంటారు. అలా అశ్రద్ధ చేయకుండా ప్రతి వారం అప్పుడప్పుడు నేను చెబుతున్న ఈ పద్ధతిని పాటిస్తే, పాదాలు అందంగా వుంటాయి. ముందుగా చల్లని నీళ్ళలో బైకార్బనేట్ సోడా కలిపి – పాదాలను కొంతసేపు ఆ నీళ్ళలో ఉంచాలి. ఆ తర్వాత పాదాలలో గరుకుగా ఉన్న చోట్లను ప్యూమిస్ రాయితో రుద్ది, అరికాళ్ళను బ్రష్‌తో తుడవాలి. టవల్‌తో పాదాలను బాగా తుడుచుకున్న తర్వాత కోల్డ్ క్రీమునుగాని, వాజిలైన్‌గాని పాదాలకు రాసుకోవాలి. చేతులు, అరిచేతులు మృదువుగా వుండాలంటే—బట్టలు ఉతికేటప్పుడు చర్మానికి హాని కలిగించని సబ్బులనే ఉపయోగించాలి. ప్రతి రోజూ రెండుసార్లు ముఖ్యంగా నిద్రపోవడానికి ముందు—ఏదైనా మంచి క్రీముగాని, లోషన్‌కాని అరచేతులకు రాసుకుని పడుకోవడం అలవాటు చేసుకోవాలి. ఈ జాగ్రత్తలను పాటిస్తే, అరికాళ్ళూ, అరిచేతులు అందంగా వుంచుకోడానికి వీలవుతుంది.

**ఆర్. ఎస్. కుమారి, మద్రాసు**

**నా చనుమొనల చుట్టూ వెంట్రుకలున్నాయి. వాటిని తీసివేయడానికి, పూర్తిగా అక్కడ వెంట్రుకలు రాకుండా చేయడానికి ఏదైనా మార్గం వుందంటారా?**

ఇలా కొందరికి వుండడం సహజమే. ఆ భాగంలో కొద్దిగానే వెంట్రుకలుంటే మీరు 'సీరియస్'గా పట్టించుకోనవసరం లేదు. ఎక్కువగా వుంటే మాత్రం 'వాక్స్' ద్వారా తీసివేయడానికి ప్రయత్నించండి. (ఈ విధానం గురించి మరో పాఠకురాలికి ఇచ్చిన జవాబులో వివరించాను) చాలా మందికి – వివాహం జరిగి, పిల్లలు పుట్టగానే అక్కడి వెంట్రుకలు వాటికవే పోతాయి।

దీపావళి నవలల పోటీలో
ప్రథమ బహుమతి పొందిన
నవల

# రాధ

పొన్నలూరు
పద్మావతి

అప్పుడే వెంకటేశ్వర సుప్రభాతం చదవడం ప్రారంభించిన రాఘవయ్యను చూసి మనసులోనే విసుక్కుంది రాధ. "నాన్నెప్పుడూ యింతే? ప్రపంచం మునిగిపోతున్నా పూజ చెయ్యంది కదలడు .... హీనపక్షం అరగంటైనా పడుతుంది, పూజ ముగిసేసరికి—అప్పటికి ఆ శుభఘడియలు గడిచిపోవు గదా!" ఆత్రుతగా దేవుని గదిలోకి చూడసాగింది. అప్పుడే పూర్తయ్యేట్టు లేదు.

చెల్లెలి కోసం చూచింది - సౌదామిని బాత్‌రూమువైపు దారి తీస్తోంది.

ఆలస్యాన్ని భరించలేక రాధ వాకిట్లోకి నడిచింది. అక్కడి పూలమొక్కలు, జాజిపందిళ్ళు ఆహ్వానించాయి. తిన్నగా వెళ్ళి సిమెంటుబెంచీ మీద కూర్చుంది.



కాలక్షేపానికి నింగి కేసి చూపు సారించింది. నీలాకాశంలో అక్కడక్కడా నల్ల మబ్బులు, బండరాళ్ళలా నిలిచి వున్నాయి. మధ్య తెల్లమబ్బులు—వాటి మధ్య సన్న సన్న మేఘ శకలాలు పిచ్చి మొక్కల్లా కదలాడుతున్నాయ్. రాధ చటుక్కున 'వాచీ' కేసి చూచుకుని ఉలిక్కిపడింది.

"అక్కయ్యా! నువ్వీ రోజు స్కూలుకెళ్ళవా?" పలకరించింది సౌదామిని.

"సౌదా! లోపలికిరా! నీతో ఓ ముఖ్య విషయం మాట్లాడాలి!" అంటూ హాల్లోకి నడిచింది రాధ.

అనుసరించింది సౌదామిని.

సౌద నడగబోయే విషయాన్ని తలచుకుంటూనే రాధ మనసు అనిర్వచనీయమైన ఆనందానుభూతిని పొందసాగింది. తనకు లోపించిన సుఖాలేవో ఇతరులకు ప్రాప్తించబోతుంటే సంతోషాతిరేకంతో పొంగిపోతుంది రాధ. అందులో తను అభిమానించే మాధవ్‌తో సౌదామినికి వివాహం జరగబోవడం తన కెంతో ఆనంద

దాయకం. తన ఆత్మీయుల కష్టసుఖాలే తనవి— తనకంటూ ప్రత్యేకమైన సుఖాలేవీ లేకపోయినా అందరి సంగతులూ తనవే....

"మాట్లాడాలన్నావ్ ! త్వరగా చెప్పు. కాలేజీ కెళ్ళాలి" తొందరచేసింది సౌద.

తనేం చిన్నపిల్ల కాదు. తన పెండ్లిని గురించి అనుకోవడం వినే వుంటుంది. తను చెప్పబోయే మాటను ఊహించుకుని సిగ్గుల పెండ్లికూతురౌతుం దనుకున్న చెల్లెలు, సర్వసాధారణంగా మాట్లాడే సరికి చకితురాలైంది రాధ.

చెల్లెలి సమ్మతి తీసుకోకుండా మాటివ్వకూడ దని నిర్ధారించుకుంది.

"చూడు సౌదా! మాధవ్‌తో నీ పెళ్ళి నిశ్చయం చేసుకునిరావడానికని వాళ్ళింటికి వెళ తున్నామన్న సంగతి నీకు తెలుసనుకుంటాను.... నీ కిష్టమేనా!" చెల్లెలి ముఖంలోకి మురిపెంగా చూచింది.

"అక్కయ్యా! నా జవాబు నీకు బాధాకరంగా వుంటుంది. కాని తప్పదు. ఇది నా వ్యక్తిగత విషయం. కనుక చెప్పక తప్పదు. సంబంధం స్థిరపరచుకురావడానికి నాన్నగారిని వెళ్ళొద్దని చెప్పవే! ప్లీజ్" ప్రాధేయపూర్వకంగా అక్క చేతులు పట్టుకుంది సౌద.

"ఏమిటే నీవనేది? పెళ్ళంటే వేళాకోళంగా వుందంటే నీకూ! నీ కిష్టం లేకపోతే ముందుగా చెప్పలేకపోయావా? తీరా నిశ్చయం చేసుకోబోతు న్నప్పుడా కాదనడం!—అసలు నీ ఉద్దేశమేమిటో బయట పెట్టు ముందు...." ఆందోళన ద్యోతక మైంది రాధ మాటల్లో. ఆమె ముఖం చిరుకోపంతో జేవురించింది. సౌదామిని కొంచెం కంగారు పడినా వెంటనే ధైర్యం పుంజుకుంది.

"మాధవరావు ప్రస్తుతం తల్లిదండ్రుల సంపాదన మీదనే జీవిస్తున్నాడు కదా! బి. ఎ. పూర్తై ఉద్యోగం చేసేదెప్పుడూ? చేసినా—ఏం, సంపాదించగలడూ? అసలతని పురాతన మనస్తత్వమే నాకు నచ్చదు...." సౌద ముఖంలో అతడిపట్ల నిరసన ప్రస్ఫుటమైంది. ఏదో భారం దించుకున్నట్లుగా నిట్టూర్చి రూము కెళ్ళి పుస్తకాలు సర్దుకోవడంలో నిమగ్నమైంది.

రాధ చెల్లెలి వెంట గదిలోకి వెళ్ళింది.

ప్రతి విషయంలో తన సలహా పాటించే చెల్లెలు, ఈ నాడు తన మాట నిరాకరించేసరికి అవమానభారంతో క్రుంగిపోయింది రాధ. కాని చివరి ప్రయత్నం కూడా చేయాలనుకుంది.

"సౌ...దా....! బాగా ఆలోచించుకునే వద్దంటు న్నావా? అంత అందగాడు, నెమ్మదస్తుడు వంద సంవత్సరాలు తపస్సుజేసినా దొరుకుతాడా?— మనమేమన్నా పెద్ద కట్నాలిచ్చి ధనవంతుల్ని తేగల స్తోమతున్న వాళ్ళమా చెప్పు! మర్యాదలు జరిపి, చదువుకేదో సహాయం చేస్తే చేసుకుంటా మన్నారని, నిశ్చయపరచుకోవాలనుకున్నాం. బంగారం లాంటి సంబంధం వద్దంటున్నావ్! నీకు మంచి రాత లేకనే దుర్బుద్ధి పుట్టింది. మన పరిస్థితి, నా మాటలు అర్థం చేసుకుంటే నీ విలా ప్రవర్తించవు — జవాబు చెప్పవేమే!" అంటూ సౌద చేతుల్లోని పుస్తకాలు వడిసిలాక్కుని టేబుల్ మీద గిరవాటేసి చెల్లెలి కళ్ళలోకి సూటిగా చూడ సాగింది.

ఆ చూపుల్లో సవాలక్ష సందేశాలు, వెయ్యి ప్రశ్నలు కదులుతున్నాయ్. ఆ తీవ్ర దృష్టికి తట్టుకోలేని సౌద నేత్రాలు నేలకు వాలేయి.

"నీ చివరి సమాధానం ఏమిటీ?" కఠినంగా ధ్వనించింది రాధ కంఠస్వరం.

అక్కకా పట్టుదలేమిటో అర్థం కాలేదు సౌదామినికి. అయినా నిష్కర్షగా చెప్పదలచుకుంది.

"పెళ్ళి విషయంలో చేసుకునే వారికి స్వతంత్రం వుండాలనీ అదే ఉత్తమమైందనీ, ఎన్నోసార్లు నీవే అనేదానివే....అలాంటిది నా విషయంలో ఎందుకక్కా నీకీ పట్టుదల! కట్నం తక్కువైనా నా అందం చూచి ఎవరైనా చేసుకుంటారనే నమ్మకం నాకుంది!" గర్వంగా తల ఎగరేసింది సౌద.

సడలింపులేని చెల్లెలి దృఢ నిశ్చయం చూచి అక్క ఆగ్రహం మితిమీరింది.

"ఎంత లావణ్యవతివైనా అంత గర్వం పనికిరాదే! వేయి జన్మలెత్తినా, మాధవ్‌లాంటి ఉత్తముడికి భార్యవు కాలేవు — చేతికి చిక్కిన రత్నాన్ని చేతులారా జార విడుచుకుంటున్నావ్!"

మాధవ్ పేరు ఉచ్చరిస్తున్నప్పుడు రాధ నయనాలు వెన్నెల రేఖలు వెదజల్లడం సౌదామిని గమనించి చిన్నగా నవ్వుకుంది.

"అక్కయ్యా! మాధవ్ పట్ల నీకంత గౌరవ భావమున్నప్పుడు — నువ్వే ఎందుకు చేసుకో కూ....డ....దూ??" అప్రయత్నంగా ఆ మాట అన్నందుకు నాలిక్కరచుకుంది.

"సౌ....దా....! నీకేమైనా మతిపోయిందా?" బిగ్గరగా వెలువడ్డాయి మాటలు.

"నేను మతుండే మాట్లాడుతున్నాను. నీ విష యంలో జోక్యం పెట్టుకునే హక్కు నాకు లేదంటావా!" చిరునవ్వు నాట్యం చేసింది సౌదామిని పెదాలపైన.

"నేను....ఏమిటే....అవునంటూ రెట్టిస్తు న్నావు. నీకేమైనా బుద్ధుందా....!" చెయ్యి పైకెత్తింది రాధ.

చెల్లెలు చెయ్యగూడనిదేదో చెయ్యమని ఆదే శిస్తున్నదనే ఆవేదన—చెయ్యలేక పోతున్నందుకు పరితాపం—తను పరాభవింపబడుతున్నాననే రోషం— అన్నీ కలిసి విచక్షణా జ్ఞానం కోల్పోయింది రాధ.

ఒక్క క్షణంలో సౌద చెంప ఛెళ్ళుమనేదే కాని ఇంతలో జానకమ్మ వచ్చి కూతురి చెయ్యి పట్టుకుంది.

"దానిమీదేంటమ్మా నీ దౌర్జన్యం?" అంటూ మందలించింది. తన తొందరపాటుకు పశ్చాత్తాపం కలిగింది రాధకు. ముని పంటితో క్రింది పెదవి కొరుక్కుంటూ—చేతులు నులుపుకుంటూ చెల్లెలి వైపు క్షమించమన్నట్లు చూచి—బరువుగా అడుగు లేసుకుంటూ అక్కడి నుంచి కదలింది రాధ.

పూజ గదిలో వున్న రాఘవయ్యకు ఇక్కడి ఘర్షణ స్పష్టంగా వినిపించడంతో...ధ్యానంలో నిమగ్నంకాలేక కర్పూర హారతిచ్చి లేచి వచ్చాడు.

సర్వం కోల్పోయినట్లు బాధపడుతూ దైన్యంగా నిలబడిన కూతుర్ని చూచి ఆర్ద్రిత చెందాడు తండ్రి. లాలనగా రాధ వీపు నిమిరి గదిలోకి నడిచాడు.

"పోనీలే తల్లీ! నీ కిష్టం లేదు. వద్దని చెప్పే శావు. మేమెందుకు నిర్బంధిస్తాం....అక్క మాటల్తో నీకెందుకు? మాధవుడంటే మమతలో పడిచస్తుంది....అందుకే దానికంత పట్టుదల. ఆస్తా—పాస్తా! ఉద్యోగమా! పాడా! ఏదో పెద్ద ధనాగారం మునిగిపోయినట్టు గింజుకుంటుంది! నీకెందుకు నిశ్చింతగా వుండు" అంటూ కూతురు తలను ఎదకు హత్తుకునే భార్యను, గువ్వపిట్టలా వొదిగి వున్న కూతుర్ని చూచి—విస్మయం చెందాడు రాఘవయ్య. రాధ వారిపట్ల ఏదో అపరాధం చేసి

నట్టు భావించుకునే వారి అవివేకానికి ఆవేదన కలిగింది.

"రాధ ఎందుకంత ఇదిగా ఆ మనువు కోసం ప్రాకులాడుతున్నదో మీరు గ్రహించుకోలేక పోతున్నారు. గుణం లేనివాడితో పడిన అగచాట్లు అందరికీ అనుభవైకవేద్యమే అయినా ఆ శాస్త్రీ చాలదన్నట్టు—ఎవరి కర్మకు ఎవరు బాధ్యులు... 'బుద్ధిః కర్మానుసారిణీ' అన్నారు" గతాన్ని గుర్తు చెయ్యబోయి వ్యధలో పడ్డాడు రాఘవయ్య.

వేదాంత ధోరణి నచ్చని జానకమ్మకు కోపం ముంచుకొచ్చింది.

"ఏమయ్యోయ్! నీ శ్రీరంగనీతులు నా దగ్గర పనికిరావు! చేసేదంతా చేసి, అంతా విధి మీద నెడుతుంటావు—మాటలేమో సనాతనం, ఆచరణకు వస్తే ఆదర్శం—నీ బడాయిలు నా దగ్గర చెప్పకు" చేతులు వ్యంగ్యంగా తిప్పుతూ రుసరుసగా భర్త వైపు చూచి విసవిస గదిలో నుంచి దూసుకు వచ్చింది జానకమ్మ.

"....హ్హూ...." భారంగా నిట్టూర్చి క్రింది పెదవి విరక్తిగా విరిచి నుదుటి మీద బాధగా బొటనవ్రేలితో రుద్దుకున్నాడు రాఘవయ్య.

"నా.... న్నా!" చేతులు నలుపుకుంటూ దీనంగా పిలిచింది సౌదామిని. ఆ చూపులో మన్నించమనే ధోరణి వ్యక్తమైంది.

తన ఆదేశాన్ని తిరస్కరించిందని రోషం కలిగినా, జాలిగొలిపే గొంతుక విని పితృ వాత్సల్యం పెల్లుబికింది.

"మనువు విరమించుకుంటున్నాను సరా!" అక్కడినుండి కదలబోయాడు.

"నాన్నా! నీ మనసెంత మంచిది నాన్నా! మీమాట తృణీకరించానని ఆగ్రహిస్తారని భయ పడ్డాను .... కాని అనుగ్రహిస్తారనుకోలేదు...."

"పిచ్చితల్లీ! మిమ్మల్ని బాధపెట్టి మేమేం బావుకుంటావమ్మా!" కూతురి తలను ఆప్యాయంగా నిమిరాడు.

ఆదే అభయహస్తంగా భావించి భయాన్ని వదిలింది సౌదామిని.

వాకిలిగేటు వేసిన శబ్దం కాగా, గుమ్మం దగ్గర కెళ్ళాడు రాఘవయ్య. తండ్రిని అనుసరించింది రాధ.

ఆదుర్దాగా ఒక అడుగు వేసి కంగారుగా ద్వారంలో నుంచి తొంగిచూచింది. తన అనుమానం స్పష్టంగా రుజువు కాలేదు. దూరంగా ఆ సందుమలుపు తిరిగిన యువకుడు...మాధవ్ కాదుకదా! అతడయితే!....గుండె దడదడలాడింది. మనసెంతో నీరసించి పోయింది. కాళ్ళు తడబడగా ఇంట్లోకి నడిచింది రాధ.

పుస్తకాలు చేతబట్టుకుని గడపలోనే ఎదురైంది సౌదామిని.

చెల్లెలి వదనంలోకి తదేకంగా చూచింది రాధ.

కొద్దిగా బెంకుతో ఒదిగి నడిచింది కాని ఆమె ముఖం కమలంలా భాసిస్తోంది. నిమ్మకు నీరెత్తినట్లున్న చెల్లెల్ని చూచి చకితురాలైంది అక్క.

ఆరోజు స్కూలుకు రానని సెలవు చీటి రాని చిన్న చెల్లెలు నివేదిత చేతికిచ్చి పంపింది.

ఈజీచైరులో మేనువాల్చిన రాధకు గతం గాయంగా, భవిష్యత్తు భయంగా — వర్తమానం అయోమయంగా తోచసాగింది. కలత నిండిన మనస్సుతో ఏదో ఆలోచిస్తూ కళ్ళు మూసుకున్నది.

రాఘవయ్య కుమార్తె వంక దీన దృక్కులు ప్రసరిస్తూ మూగ వేదనతో మౌనం వహించాడు.

జానకమ్మ వాళ్ళను విచిత్రంగా చూస్తూ మూతి మూడు వంకలు త్రిప్పుకుంటూ వెళ్ళింది.

వాళ్ళ ధోరణులు గమనించని రాధ తన మనసులో చెలరేగే ఆలోచనలతో సతమతం కాసాగింది.

## 2

వికల మనస్కురాలైన రాధ నిలకడగా ఒక్క చోట కూడా గడపలేకపోతూంది. పుస్తకాలబీరువా, అన్నయ్య టేబుల్, తనపెట్టె — ఎన్నో సర్దింది. ఒక్క పనైనా స్తిమితంగా చెయ్యలేక పోతోంది. యాంత్రికంగా మరబొమ్మలా తిరుగుతున్న రాధను ఎవ్వరూ పలకరించలేక పోతున్నారు. తల్లి మాటలు ఈసడింపుగా వుంటాయని, ఆమెనేమీ మాట్లాడవద్దని బ్రతిమాలుకున్నాడు తండ్రి. తన లాలింపు మాటలు మేఘావృతమైన కూతురి మనసుపై, చల్లగాలిలా పనిచేసి, వర్షింపజేస్తాయనే జంకుతో .... పిలవడం విరమించుకున్నాడు. చెల్లెళ్ళిద్దరూ అక్క చాయలకు రావడానికి సంశయిస్తున్నారు.

తన ఎదుటికి రావడానికి సాహసించని వాళ్ళను చూచి, తనను వెలివేసినంతగా బాధ కలిగింది



ఆల్ ఇండియా విమెన్స్ కాన్ఫరెన్స్‌కు మూడవ పర్యాయం అధ్యక్షురాలిగా ఎన్నికైన ప్రముఖ సంఘ సేవకురాలు శ్రీమతి లక్ష్మీరఘురామయ్యకు భారత రాష్ట్రపతి శ్రీ ఫక్రుద్దీన్ అలీ అహమ్మద్ అధ్యక్షతన ఇటీవల హైదరాబాదు రవీంద్ర భారతిలో ఘన సన్మానం జరిగింది. రాష్ట్రపతి — శ్రీమతి లక్ష్మీ రఘురామయ్య సంఘసేవా దీక్షను ప్రశంసించారు. ఆంధ్రప్రదేశ్ గవర్నర్ శ్రీ ఆర్. డి. బండారే, రాష్ట్రమంత్రి శ్రీ ఎల్. లక్ష్మణదాసు, అసెంబ్లీ సభ్యులు శ్రీ శ్రీనివాసరావు ఆమె సేవను కొనియాడారు. శ్రీ టి. ఎస్. కృష్ణానందం రాసిన 'లక్ష్మీరఘురామ్ జీవన స్రవంతి' అన్న పుస్తకాన్ని ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తి శ్రీ ఆవుల సాంబశివరావు ఆవిష్కరించారు. సన్మాన సభా సందర్భంగా వెలువరించిన ప్రత్యేక సంచికను బేగం అబీదా అహమ్మద్ విడుదల చేశారు. శ్రీమతి లక్ష్మీ రఘురామయ్య తమకు జరిగిన సన్మానానికి కృతజ్ఞతలు చెప్పి సముచితంగా ప్రసంగించారు.

శ్రీ శ్రీనివాసరావు వందన సమర్పణ చేశారు.



ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అధ్వర్యంలో జరుగుతున్న కుటుంబ నియంత్రణ ప్రచార కార్యక్రమాల సహాయార్థం ప్రసిద్ధ నటి కుమారి వాణిశ్రీ లక్ష రూపాయల చెక్కును ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుకు అందజేశారు. పశ్చిమ గోదావరిజిల్లా జంగారెడ్డిగూడెంలో లక్ష్మి థియేటర్ ప్రారంభోత్సవ సభలో ఆమె ఈ విరాళం ఇచ్చారు.



రాధకు. తనేదో పరాభవించబడినట్టు, ఓడిపోయినట్లు వ్యధ కలుగుతోంది ఆమెకు.

తను వారిపట్ల చేసిన అపరాధమేమిటో ఆమెకు అర్థం కాలేదు. ప్రతివారి విషయాల్లో తల దూర్చడమే తన నేరమా? అందరి భవిష్యత్తు గురించి తలపోయడం తప్పేనేమో!

ఎదిగిన ఏ ఆడపిల్లా, తనలా కన్నవారింటిపై యింత మమకారం చూపదేమో! తన ఆత్మీయులే తనకు పంచప్రాణాలు. తనకు వేరే లోకంలేదు. తన ప్రపంచం తన వాళ్ళు మాత్రమే. అలా కాకుండా తనకూ ఒక జీవితమంటూ వుంటే....? ఆపైన ఆలోచించలేక వంటింట్లోకి వెళ్ళి—ఓ గ్లాసు మజ్జిగ త్రాగి వచ్చింది. కొంతతాపం ఉపశమనం పొందినట్లైంది.

అక్కడున్న పూలబుట్ట తీసుకుని పూలచెట్ల సమీపానికి చేరింది.

సౌకుమార్యంతో అలరారుతూ, సౌరభాన్ని అందించే పూలబాలల్ని తాకుతున్నప్పుడు, హర్షాతిరేకంతో పులకించి పోతుంటుంది రాధ. ఏనాటి కానాడు కొత్తభావాలు మదిని మధురానుభూతితో నింపుతుంటాయి. అవే తనకు సంతోషాన్నిచ్చే సాధనాలు. కాని ఆ రోజు.... ఏలాంటి అనుభూతి లేక యాంత్రికంగా పువ్వులను త్రుంచి మాల కట్టసాగింది.

మనోవీధిని ఆక్రమించుకున్న విచార మేఘాలను ఏ విధంగా తొలగించుకోవాలో మార్గం గోచరించలేదామెకు.

గేటుతీసిన చప్పుడు కాగా తలెత్తి చూచింది.

మాధవ్ తనవైపే చూస్తూ వస్తున్నాడు.... ఈ సంగతెలా చెప్పడం? నాన్న సౌదామినితో పెళ్ళి స్థిరపరచుకోడానికి వాళ్ళింటికొస్తున్నాడని విన్నప్పుడు వెన్నెల వెదజల్లిన అతడి నయనాలు అలా జరగదని తెలిసినప్పుడు కళాహీనమైపోవా? సౌద నిరసన అవమానంగా భావించకుండా వుండగలడా??....నాన్న వాళ్ళింటికి రాకపోవడంతో సంబంధం వద్దనుకున్నట్టు గ్రహించి....అది అవమానంగా భావించి, ప్రైవేటుకు యిక రానని చెప్పి, ముఖాన నాలుగు దులపడానికే వచ్చుంటాడు—రోజూ అతణ్ణి చూచే అదృష్టానికి కూడా దూరమౌతుంది....ఛ....ఛ....ఏమిటీ చపలచిత్తం.... ప్రతిదినం చూడాలని అభిలషించడం....నేరం....కాదా! ఏమిటీ వెర్రికోరిక? ఛ....ఛ....తన బుద్ధి వక్రమార్గాన పోతుందేమిటీ?

"రాధాదేవిగారు! ఊహాలోకాల్లో మీరొక్కరే విహరించకపోతే....మాకూ కాస్త వర్ణించి చెప్పకూడదూ! మేమూ ఆనందంలో పాలుపంచుకుంటాం కదా...." అని మాధవ్ చిరునవ్వుతో పలకరించేదాకా రాధ ఆలోచనాపరంపరలలో మునిగిపోయివుంది.

అతడివైపు నేరుగా చూచే సాహసం లేక.... నెమ్మదిగా కనురెప్పలు పైకెత్తింది.

ఎప్పటిలా మెరిసే కనులూ, అధరాలపై దరహాస వీచికలు, మంద్రస్వరం....కొంచెం కూడా మార్పులేని రూపం.

ప్రస్తుత పరిస్థితి అతణ్ణి ఆందోళనపరచలేదేమిటి?
ఐనా తనకెందుకీ తాపత్రయం? పాపం అతడికి అసలు విషయం తెలియక పోవచ్చునేమో! ఏదో అనివార్య కారణాలవల్ల నాన్న వెళ్ళనట్లుగా మాత్రమే....అనుకుంటున్నాడేమో.... !సౌదామిని తిరస్కృతిని ఎలా చెప్పడం??

తన రాకను గుర్తుచేస్తూ తాళపు చెవితో కుర్చీ మీద శబ్దం చేశాడు.

"కూర్చో మాధవ్! అన్నయ్య ఇంకా పూర్తించి రాలేదు" అన్నది రాధ తన గాభరాను అణుచుకోడానికి ప్రయత్నిస్తూ—చిరునవ్వును అరువు తెచ్చుకుంటూ....

"క్రొత్తగా మాట్లాడుతున్నావేమిటీ? మాస్టారుగారు వుళ్ళో లేకపోతే—తప్పక ఇంటికొచ్చి పోతూ వుండు, అవసరాలేవైనా వుంటాయి అంటుంటారుగా!" అతి సహజంగా అన్నాడు మాధవ్.

జవాబు దొరకలేదు రాధకు.

ఇరువురి మధ్య మౌనం రాజ్యం చేసింది.

"నీవలా 'డల్'గా వుంటే బాగోలేదు. ఏమైనా మాట్లాడు రాధమ్మా!" ప్రాధేయత ధ్వనించింది అతడి మాటల్లో.

"ఏం మాట్లాడను? మాటలు దొరకడం లేదు. ఇంక దొరకవేమో కూడా!" బరువుగా వెలువడ్డాయి మాటలు.

*[ఇది దీపావళి విశేష సంచిక కాబట్టి—మామూలుగా వుండే కుట్టుపని బడి, బామ్మగారి పేజీ మొదలైన శీర్షికలు ఈ సంచికలో లేవు. వచ్చే సంచిక నుంచి, మామూలుగా వుంటాయి. వ. సం.]*

భావగర్భితంగా విషయాన్ని వివరించబోయింది.

"అయితే మీరంతా ఏదో ఉద్దేశం మనసులో పెట్టుకుని మాత్రమే నన్నభిమానిస్తున్నారన్న మాట? నేను చాలా పొరపాటు పడ్డాను!" మాధవ్ ముఖంలో కినుక, మాటల్లో నిష్ఠురత ప్రస్ఫుటమైనాయి.

"నువ్వసలు వున్న సంగతిని పసిగట్టినట్టు మాట్లాడుతున్నావే! అదే నిజమైతే దాన్నింత తేలిగ్గా తీసుకోగలిగావా?" అతడి పరిస్థితి గమనించే కొద్దీ విస్మయం కలగసాగింది రాధకు.

"పసిగట్టడమేం ఖర్మ, ప్రత్యక్షంగా విన్నాను. ఇంకేమైనా వివరాలు కావాలా....?"

"మాధవ్! అన్నీ....అన్నీ విన్నావా?" రాధ గొంతు తడబడింది. శరీరం చిన్నగా కంపించసాగింది.

'భగవాన్! అతడెన్ని మాటలన్నా భరించాలా? అన్నీ తెలిసి....అంతనిమ్మళంగా వున్నాడంటే....అది తుఫానుకు ముందు ప్రశాంతతే అయివుండాలి. అయితే ఓ బెడద తప్పింది. తనెలా వివరించాలా అన్న సమస్య తీరిపోయింది' అనుకుని దీర్ఘ నిశ్వాస వదలి, కాస్త ధైర్యంగా ముఖం పైకెత్తింది రాధ.

"నీవెందుకింత బెంబేలుపడిపోతున్నావో నాకవగతం కావడంలేదు. నీ చర్యల్లో, మాటల్లో లోకాలన్నీ ముంచుకుపోతున్నంత చింత వ్యక్తమౌతోంది. నీ ఆకాంక్షను అనవసరంగా ఒకరి మీద రుద్దాలని చూశావు. అది బెడిసికొట్టింది. అనుకోని పరిణామానికి తట్టుకోలేకపోతున్నావు. అంతేగా?" అనునయంగా అంటూ ప్రశ్నార్థకంగా చూచేడు మాధవ్.

తన మనోభావాలను క్షుణ్ణంగా చదవగలిగిన మాధవ్ నేర్పరితనానికి అచ్చెరువొంది విప్పారిన నేత్రాలతో విచిత్రంగా చూస్తూ కూర్చుంది.

మాటలు కరువై ప్రతిమలా వుండిపోయిన రాధను పలకరించలేక తనే మాట్లాడ్డం ప్రారంభించాడు మాధవ్.

"శ్రద్ధగా విని ఆకళింపుచేసుకో! యథార్థం ప్రస్తుతానికి బాధాకరమనిపించవచ్చునేమో! కాని, అది భవిష్యత్తుకు బంగారు బాట కావచ్చు. ఒక్కొక్కసారి కొన్ని మంచికే దారితియ్యగలవు. సౌదామని మాటల్లో అంతరార్థముంది-మన అందరి కళ్ళుతెరిపించే పరమసత్యం యిమిడివుంది"

# విడరాని జంట
# కో-ఆప్టెక్స్ దీపావళి

దీపావళికి
ప్రత్యేక తగ్గింపు;
నూలువాటికి **10%**
పట్టువాటికి **15%**



దీపావళి పండగసంబరానికి ప్రతినామం కో-ఆప్టెక్స్.
ఈ దీపావళికి, కో-ఆప్టెక్స్ యావత్కుటుంబానికే సర్వసమృద్ధిగ సన్నిద్ధమై వచ్చింది!
కో-ఆప్టెక్స్ నందున్న ఆ వివిధ వస్త్రశ్రేణి అద్భుతమైనది.
చీరెలు: కాంచీపురం, ఆరణి, కుంభకోణంలనుంచి వచ్చిన శుద్ధ పట్టువి; వొరైయూర్ కోయంబత్తూరు సేలం, మధురలనుంచి వచ్చిన చేనేత నూలు చీరెలు; సుంగడి అద్దకాలు మరియు చిన్నలపట్టి చీరెలు, ధోవతులు, ఉండు గుడ్డలు, లుంగీలు. పరదా గుడ్డలు, షర్టింగులు, ముస్తాబు గుడ్డలు.

**సెప్టెంబరు 22 నుంచి**
**అక్టోబరు 23 వరకు**

మీరూ మరియు కో-ఆప్టెక్స్, మీ కుటుంబం మరియు సీతాకోకచిలక.
నాణ్యత మరియు ప్రజామోదం పొందిన ధరలు (కో-ఆప్టెక్స్‌నందు) ఆధునికత మరియు ఉత్కృష్టత.
కో-ఆప్టెక్స్ మరియు దీపావళి విడరాని జంట ఇవి.

**కో-ఆప్టెక్స్**
**ఎంపోరియం**

గోదావ్రి, స్టేషన్ రోడ్,
సికిందరాబాద్




షోరూంలు ఆదివారాలు, సెలవు దినాలలో తెరచి యుంటాయి.

"అయితే నన్నేమందో కూడా....స్పష్టంగా విన్నావా మాధవ్! నేను....నేనట నిన్ను...." విషాదంగా నవ్వింది.

ఏదో పొరపాటు చేసినట్లు నాలిక కరచుకుంది.

"ఇందులో వింతేముంది....?ఊహించని విషయం గనక విచిత్రంగా వుండడం సహజమే-నిప్పులాంటి నిజం కాల్చివేసేదే గాక ఆ పరిస్థితినిబట్టి చలికాచుకునేదిగా కూడ ఉపయోగపడుతుంది!" అర్థయుక్తంగా అంటూ రాధ నయనాల్లోకి తదేకంగా చూడసాగాడు.

అతడి ధోరణిలో ఏదో క్రొత్తదనం కొట్టవచ్చినట్లు గ్రహించింది రాధ.

'సౌద నిరాకరించినందువల్ల నైరాశ్యంలో వేదాంతం పుట్టుకొచ్చి వుండవచ్చు. శ్మశాన వైరాగ్యం, ప్రసూతి వైరాగ్యం తాత్కాలికాలే నంటారు. అలాగే....మరి తన ప్రసక్తి వచ్చినపుడు, గ్రుచ్చి గ్రుచ్చి చూడడం ఏమిటీ?.... అది తన భ్రమ కాదుకదా!' ఆమె మనసులో ప్రశ్నల పరంపరలు చెలరేగాయి.

ఆమె నుంచి సమాధానం రాదని గమనించి, తనే మళ్ళీ మాట్లాడ్డం మొదలుపెట్టేడు మాధవ్.

"సౌదతో నా పెళ్ళి జరగనంతమాత్రాన, నీ వంత బాధెందుకుపడాలో నా కర్థం కావడం లేదు. ఆ అమ్మాయన్నట్టు, ఏ భాగ్యవంతుడో ఆమె సౌందర్యం చూచి చేసుకోవచ్చు. మీ యింటి మనువు కాకపోతే నే నిప్పట్లో పెళ్ళిచేసుకోవాలనుకోలేదు—బాగా చెప్పాలంటే మీ 'ఫామిలీ' మీది గౌరవం—నీ మీదున్న అభిమానంతో ఒప్పుకున్నాను....ముఖ్యంగా....నిన్ను...."

"నన్ను....నన్నేమిటి మాధవ్!" సంభ్రమాశ్చర్యాలు పెనవేసుకున్నాయామె గొంతున.

"అవును. రాధమ్మా! నాకెందుకో నీ సాన్నిధ్యంలో గడపాలని వుంటుంది.... చిన్నప్పటినుంచి కూడా నీ వంటే ఎంత ఇష్టపడేవాణ్ణో నీకు తెలీదా?—మనం పెరిగినా నాకా ఉద్దేశం తరగలేదు....నిన్ను అనుక్షణం చూడాలని వుంటుంది....అది నీతో చెప్పడానికి సాహసించ లేకపోయా నింతకాలం....అది నువ్వు హాస్యంగా తీసుకుని, నన్నో చవట క్రింద జమ కడతావని భయపడ్డాను. నిన్ను గురించి నాలో నే నెంత....సారీ....ఇప్పుడు చెప్పలేను.... మనసులో మాట చెబితే నీవు అపార్థం చేసుకుని ఇక నా ముఖం గూడా చూడవని....ఈ మూలంగానైనా నిన్ను దూరం చేసుకోకుండా వుండవచ్చుని ఆశించాను....అందుకే...."

"మాధవ్! ఏమిటిలా మాట్లాడుతున్నావ్! మతిగాని చలించలేదు కదా? నా మనసు పరీక్షించదలచుకున్నావా?? లేక నా మనసును తక్కువ అంచనా వేసుకున్నావా! చెప్పు మాధవ్! చెప్పు...." ఆనందావేశాలు మిళితంకాగా విభ్రాంతిగా మాధవ్ కేసి చూడసాగింది రాధ.

"ఏమిటమ్మా! మాధవుణ్ణి చెప్పమని నిలదీసి అడుగుతున్నావ్? ఆ చనువు, ఆ అర్హత మనకు దూరమౌతున్నాయని మరిచిపోతున్నావా తల్లీ!"

బాధగా రాధ భుజం తట్టి—ముఖం ప్రక్కకు త్రిప్పుకున్నాడు అప్పుడే అక్కడికొచ్చిన రాఘవయ్య.

"మామయ్యా! మీరంతా నన్నెందుకు వేరుచేసి మాట్లాడుతున్నారు? మన సాన్నిహిత్యం యీనాటిది కాదుకదా? అది వియ్యంతో మాత్రమే బలపడుతుందని భ్రమిస్తున్నారా?? అనుకున్న విధంగా జరగకపోతే....నన్ను...,దూరంగా తరిమెయ్యడమేనా???" దీనంగా ధ్వనించింది మాధవ్ స్వరం.

"నీ మంచితనంతో నన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తున్నావు మాధవా! నీలాంటి ఉన్నతుణ్ణి అల్లుడుగా పొందే అదృష్టం లేనందుకు విచారిస్తున్నానయ్యా! దేనికైనా పెట్టి పుట్టాలయ్యా....!చేతులారా ఒకటి చెరుచుకున్నాను. చేజేతులా మరొకటి చేజార్చుకుంటున్నాను...." రాఘవయ్య గొంతు గాద్గదికమైంది.

ఇంటికెళుతున్నానని సౌంజ్ఞ చేసేడు మాధవ్. తల ఆడించింది రాధ. [సశేషం]



దీపావళి నవలల పోటీలో ప్రథమ బహుమతి పొందిన 'రాధ' సశేష నవల రచయిత్రి శ్రీమతి పొన్నలూరు పద్మావతి స్వగ్రామం నెల్లూరు జిల్లాలోని కావలి. ప్రస్తుతం భర్త పి. ఎస్. రామచంద్రయ్యగారి ఉద్యోగరీత్యా ఆమె నెల్లూరులో ఉంటున్నారు.

ఆరు సంవత్సరాల క్రితం రచనా వ్యాసంగం ప్రారంభించి నాలుగు నవలలు, ఆరు నవలికలు, నాలుగు నాటికలు, దాదాపు ఏభై కథలు, కొన్ని కవితలూ రాశారు.

"స్త్రీ జీవితంలో ముఖ్యమైనది వివాహం. సంసారంలో కలతలవల్ల మొదట దెబ్బ తినేది స్త్రీ జీవితమే. పురుషుడు ద్వితీయ వివాహం చేసుకున్నంత తేలికగా స్త్రీ విషయంలో కుదరదు. వితంతువునైనా వివాహం చేసుకోడానికి ముందుకు వస్తారుకానీ, భర్త చేత త్యజింపబడిన యువతిని మళ్ళీ పెళ్ళి చేసుకోవడానికి ఎవరూ ముందుకు రారు. (ఆమె వల్ల ఏ తప్పూ జరగక పోయినా సరే—ఆమెకు ఎలాంటి సానుభూతీ లభించదు). నిజా నిజాలు అర్థం చేసుకోగల యువకుడు ఒక వేళ అటువంటి స్త్రీని పెళ్ళి చేసుకోడానికి ముందంజ వేసినా, అతని జీవితం ఎప్పుడూ పరిహాసాలకు గురవుతూనే ఉంటుంది. మన సామాజిక జీవితంలో—ఈ విషాద సమస్య కారణంగా కొందరి జీవితాలలో రగిలే సంఘర్షణకు ఒక రూప కల్పన చేయాలన్న ఉద్దేశంతో 'రాధ' నవల రాశాను" అన్నారు శ్రీమతి పద్మావతి—ఈ నవల రూపొందిన విధానాన్ని వివరిస్తూ.

"సాహిత్యం సమాజాన్ని చైతన్యవంతం చేయగలదన్న నమ్మకం నాకు పూర్తిగా వుంది. ముఖ్యంగా మన సమాజంలో ఈ నాటి స్త్రీ రకరకాల సమస్యలను ఎదుర్కొంటూ ఉంది. రచయిత్రులు కేవలం ఆ సమస్యలనే తమ సాహిత్యంలో ప్రతిబింబించకుండా, వాటికి పరిష్కారాలను కూడా తమ రచనలలో సూచించగలిగితే-చాలా ప్రయోజనకరంగా ఉంటుందని నా అభిప్రాయం. ఆ దృష్టితోనే నేను రచనలు చేయడానికి ప్రయత్నిస్తుంటాను" అంటారు శ్రీమతి పద్మావతి.

# భరత నాట్యాన్ని ప్రపంచ వ్యాప్తం చేసిన ఇద్దరు నర్తకీమణులు

"ఇప్పుడు అమెరికాలో నిర్మింపబడుతున్న ఆలయాల కుంభాభిషేకం–వచ్చే ఏడాది జరుగుతుంది. అప్పుడు శ్రీమతి పద్మినితో కలిసి 'కురవంజి' పద్ధతిలో ఒక నృత్య నాటకంలో పాల్గొనబోతున్నాను" అన్నారు ప్రసిద్ధ భరత నాట్య తార శ్రీమతి కమల–'వనిత' జరిపిన ప్రత్యేక గోష్ఠిలో.

"మనదేశం నుంచి 1947–48లలో చైనాకు భారత ప్రభుత్వ పక్షాన వెళ్ళిన తొలి సాంస్కృతిక బృందంలో నేనుకూడా సభ్యురాల్ని. ఆ బృందంతోనే శ్రీలంకకు కూడా వెళ్ళి నాట్య ప్రదర్శనలు ఇచ్చాను. 1953లో బ్రిటిష్‌రాణీ ఎలిజబెత్ పట్టాభిషేక సందర్భంగా మా బృందంతో కలిసి 'బకింగ్‌హామ్ పాలెస్'లో నాట్యం చేశాను. 1958లో తూర్పు యూరపు దేశాలలో పర్యటించి నాట్య ప్రదర్శనలు ఇచ్చాను," అన్నారు శ్రీమతి కమల విదేశాలలో తమ నాట్యానుభవాల గురించి చెబుతూ.

ప్రస్తుతం ఆమె మద్రాసులో 'భరత నాట్యాలయ' అన్న నాట్య పాఠశాల నిర్వహిస్తున్నారు. "పదేళ్ళ నుంచీ ఈ పాఠశాల పని చేస్తున్నది. ఈ పదేళ్ళలోనూ పదిమందికే నాట్య శిక్షణ ఇచ్చాను. ఎక్కువ మందిని చేర్చుకుంటే నాట్యం నేర్పడం కష్టమవుతుందని నా అభిప్రాయం. అదీ కాక నాట్యంలో గురుశిష్యుల మధ్య సన్నిహిత సంబంధం ఉండాలి. అప్పుడే నాట్యంలోని మెలకువలన్నీ బాగా తెలియజెప్పడానికి వీలవుతుంది. నేను నా అయిదవయేటనుంచీ రంగం మీద నాట్యం చేస్తున్నాను. నాట్యంలో నాకు శిక్షణ ఇచ్చిన గురువులు-కాట్టుమన్నార్‌కోవిల్ ముత్తుకుమరప్పపిళ్లైగారు, వళువూర్ రామయ్యాపిళ్లైగారు. ప్రస్తుతం నా దగ్గర శ్రీనిధి రంగరాజన్ అన్న ఐదేళ్ళ బాలిక ఎంతో ఆసక్తితో నాట్యం నేర్చుకుంటున్నది. త్వరలోనే ఆమె రంగ ప్రవేశం చెయ్యగలదు" అన్నారు శ్రీమతి కమల.

"అమెరికాకు వెళ్ళి నాట్యం చేసిన మొదటి భారతీయ నాట్యబృందం మాదే. ఆ బృందంలో నా చెల్లెళ్ళు రాధ, వసంతి ఉన్నారు!" అని ఉత్సాహంగా చెప్పిన శ్రీమతి కమల–కాల్గేట్ విశ్వవిద్యాలయానికి చెందిన కొందరు అమెరికన్లకు ఆమధ్య 'ప్రహ్లాద భక్తి విజయం' (త్యాగరాజస్వామి రచించిన యక్షగానం) నృత్య నాటకాన్ని అభినయించడానికి నేర్పారు. ఆ నృత్య నాటకం మద్రాసు, ఢిల్లీ, మధురైలలోనూ, అమెరికా నగరాలలోనూ ప్రదర్శింపబడి ప్రశంసలు సంపాయించింది!

"భరత నాట్యం నేర్చుకునే ప్రతివారూ ప్రసిద్ధి గడించిన తారలను దృష్టిలో ఉంచుకొని వారిలా నాట్యమాడే ప్రయత్నం చెయ్యక, తమ సొంత ధోరణిని పాటించి విజయం సాధించడం మంచిది" అంటారు శ్రీమతి కమల.

"భరత నాట్యాన్ని ప్రధానాంశంగా తీసుకొని దాని ప్రసిద్ధిని వివరించే చలనచిత్రం ఒకటి రూపొందించాలన్నది నా చిరకాల వాంఛ. కాలమే దాన్ని సఫలంచెయ్యాలి!" అన్నారు ఆమె. ఆ వాంఛ సఫలమైతే భరత నాట్య కళా ప్రియులకు ఆ చలనచిత్రం చక్కని కానుక కాగలదు!

*

"అమెరికాలోని భారతీయ ప్రముఖులు 'మనం భారతీయులం. మనం పూజించడానికి అనువుగా ఇక్కడ ఒక హిందూ దేవాలయం ఉండడం అవసరం' అనుకుని 'హిందూ టెంపుల్ సొసైటీ' అన్న ఒక వ్యవస్థను నెలకొల్పి అందులో నన్ను కూడా 'ట్రస్టీ'గా నియమించారు. ఆ ఆలయ నిధి కోసం 1971 మేలో నేను టేప్ రికార్డర్ సాయంతో న్యూయార్కులో ఒక నాట్య ప్రదర్శన జరిపాను. ఆ ప్రదర్శన ద్వారా 13వేల డాలర్లు లభించాయి. దాంతో న్యూయార్క్ సమీపాన ఉన్న క్వీన్స్ ఫిషింగ్ అన్న చోట–ఒక పాత రష్యన్ చర్చి ఉన్న చోట వినాయకుడి గుడి కట్టించారు. అక్కడే సుబ్రహ్మణ్య స్వామి, అయ్యప్ప, శివుడు, పార్వతి వంటి దేవతలకు కూడా ఆలయాలు పూర్తి కావస్తున్నాయి. భారత దేశానికి దూరంగా ఉన్నా నా నాట్య సేవ ఆగిపోలేదు" అన్నారు ఇటీవలే మద్రాసుకు వచ్చిన ప్రముఖ నాట్య తార శ్రీమతి పద్మిని–'వనిత' జరిపిన ప్రత్యేక గోష్ఠిలో ముచ్చటిస్తూ.

తమ నాట్య విద్యాభ్యాసం గురించి ప్రస్తావిస్తూ ఆమె "నేను తిరువనంతపురంలో గురు గోపీనాథ్ దగ్గర కథకళి నేర్చుకున్నాను. భరత నాట్యంలో నాకు తిరువిడైమరుదూర్ శ్రీ టి. కె. మహాలింగం పిళ్లై గురువు" అన్నారు.

విదేశాలలో తన నాట్యానుభవాల గురించి చెబుతూ "చలనచిత్ర రంగానికి సంబంధించినంతవరకు ఒక నాట్య బృందంతో మొట్టమొదటిసారిగా విదేశాలకు వెళ్ళి నాట్యం చేసిన అవకాశం మాకు (లలిత, పద్మిని, రాగిణి) లభించింది.

"1950లో సింగపూరు, శ్రీలంక మొదలైన దేశాలకు వెళ్ళి అక్కడ నాట్య ప్రదర్శనలు ఇచ్చాము. శ్రీలంకలో మేము సుబ్రహ్మణ్య స్వామికి సంబంధించిన నాట్యం చేస్తుండగా, నాట్యం చూస్తున్న ప్రేక్షకులలో ఒకరు భావావేశంతో రంగం మీదికి వచ్చి మాతోబాటు కలిసి నాట్యం చేయసాగారు!

"సోవియట్ యూనియన్‌లో పదేళ్ళకొకసారి అన్నిదేశాల నాట్య బృందాలూ పాల్గొనే నాట్యోత్సవంలో పాల్గొనే అవకాశం 1957లో మాకు లభించింది. అప్పట్లో 146 దేశాల ప్రతినిధులు అందులో పాల్గొన్నారు. 'ఉత్తమ భారతీయ నాట్య కళాకారిణులు' అన్న గుర్తింపుతోబాటు మేము బంగారు పతకం కూడా సంపాయించాము. 1966లో తాష్కెంట్‌లోనూ మా నాట్య ప్రదర్శనలు జరిగాయి.

"అమెరికాలోని న్యూయార్కు నగరంలో ఉన్న కార్నెగీహాల్‌లో సాధారణ కళాకారులకు నాట్యం చెయ్యడానికి అవకాశాలు లభించడం కష్టం. అందులోనూ విదేశీయులకు అక్కడ

వర్ణచిత్రాలు: కె. ఆర్. ఎ. శక్తి

కమల

నాట్యం చేసే అవకాశాలు లభించడం అసాధ్యమైన విషయం. అంతటి ప్రసిద్ధి గడించిన కార్నెగీ హాలులో 1973లో 'కణ్ణగి' అన్న నృత్య నాటకాన్ని ప్రదర్శించి అక్కడి వారి అభినందనలు పొందే సదవకాశం మా బృందానికి లభించింది!'' అన్నారు పద్మిని.

ఆమె ప్రస్తుత కార్యక్రమాలు ఏమిటి?

''నా భర్త అమెరికాలో డాక్టరుగా పని చేస్తున్నారు. వంట పనీ, తక్కిన ఇంటి పనులూ అన్నీ నేనే చేసుకుంటాను. వీలున్నప్పుడల్లా మా వారికి నర్సింగ్‌లోనూ వాటిలోనూ సాయపడుతుంటాను. ఆయన సహకారం వల్లా,

పద్మిని

మా అబ్బాయి ప్రేమ్ ఆనంద్ సహాయంవల్లా — నేను నా నాట్య కార్యక్రమాలను నిర్విఘ్నంగా నడుపుతు వస్తున్నాను. ప్రస్తుతం న్యూయార్కు, ఫిలడెల్ఫియాలలో మూడు చోట్ల నాట్య పాఠశాలలు నడుపుతున్నాను. మొత్తం 61 మంది నాట్యం నేర్చుకుంటున్నారు. ఈ పాఠశాలలో భరతనాట్యం, కథకళి నేర్పుతున్నాను. ఈ నాట్యాల కోర్సులను ఐదేళ్ళపాటు నేర్చుకోవాలి. నేర్చుకునే వారి ఆసక్తినిబట్టి ఈ కాల పరిమితి మూడేళ్లగా తగ్గిస్తాము. నా భర్తకు నా సాయం అవసరం లేని సమయాలలో నాట్యం నేర్పుతుంటాను. ఉదయం పది నుంచీ ఒక్కో బృందానికి గంటసేపు శిక్షణ చొప్పున మధ్యాహ్నం 2 గంటల దాకా నాట్యం బోధిస్తాను. ఆదివారాలలో న్యూయార్కుకు 150 మైళ్ళ దూరాన ఉన్న ఫిలడెల్ఫియాకు వెళ్ళి నాట్య శిక్షణ ఇస్తాను. ఇంట్లోనూ రాత్రుళ్ళు ఏడుగంటల నుంచీ ఎనిమిది గంటలదాకా శిక్షణ ఇస్తున్నాము. అలా ఎనిమిది మంది నాట్యం నేర్చుకుంటున్నారు" అన్నారు పద్మిని.

అమెరికాలో తమ నాట్య కార్యక్రమాల గురించి ప్రస్తావిస్తూ శ్రీమతి పద్మిని—"అమెరికాలో ఇప్పటిదాకా 65 నాట్య ప్రదర్శనలు జరిపాను. ప్రతి నాట్యం అభినయించే ముందు ఆ నాట్యం గురించిన వివరాలు అమెరికన్లకు అర్థమయ్యేలా ఆంగ్లంలో వివరిస్తాము. మొదట్లో టేప్ రికార్డర్‌లో రికార్డ్ చేసిన సంగీతం సాయంతో నాట్య ప్రదర్శనలు ఇచ్చేదాన్ని. ప్రస్తుతం అమెరికాలోనే పక్కవాద్యాలు వాయించేవారు కూడా ఉన్నారు. తమిళ చిత్ర నిర్మాత, సంగీత దర్శకులు అయిన ఆర్. పార్థసారథిగారు ఈ విషయంలో నాకెంతో సాయపడుతున్నారు;" అన్నారు.

అమెరికాలో తమ దగ్గర నాట్యం నేర్చుకుంటున్న అమెరికన్ల శ్రద్ధనూ, ఉత్సాహాన్నీ ప్రశంసిస్తారు ఆమె. "వారు మన నాట్యాన్ని ఎంతో గౌరవిస్తారు. ప్రశంసలు కురిపిస్తారు. ఎంతో ఇష్టంగా నేర్చుకోవడానికి ప్రయత్నిస్తారు. నాట్యం నేర్చుకునేముందే మన నాట్యాల గురించిన వివరాలన్నిటినీ కూలంకషంగా తెలుసుకుంటారు. నాట్యం నేర్చుకోవడం ప్రారంభిస్తే—అప్పటినుంచీ కఠినమైన పరిశ్రమచేసి నాట్యాన్ని సాధిస్తారు. మన దేశంలో తల్లిదండ్రుల బలవంతం కొద్దీ నాట్యం నేర్చుకునే పిల్లలలో అంతటి ఉత్సాహమూ, శ్రద్ధా కనిపించవు" అంటారు పద్మిని. *



## ప్రముఖ దేశ సేవకురాలు

# ఆదుర్తి లక్ష్మీబాయి

దేశసేవ చేయాలనీ, తాను నమ్మిన ఆదర్శాల కోసం — పెద్దల అడుగుజాడల్లో పయనించాలని ఆశించే వనితలు తమకు ఎన్ని కష్టాలొచ్చినా వెనుకాడకుండా — సమాజాభ్యుదయం కోసం కృషిచేస్తారు. తమకు ఓపిక ఉన్నంత వరకూ సంఘసేవే పరమావధిగా భావిస్తారు. అటువంటి వారిలో శ్రీమతి ఆదుర్తి లక్ష్మీబాయిగారొకరు.

లక్ష్మీబాయిగారు వరహాగిరి వెంకట జోగయ్య పంతులు, వెంకటసుబ్బమ్మగార్ల పుత్రిక. మాజీ రాష్ట్రపతి వి. వి. గిరిగారి సోదరి. ఈమె 1899 అక్టోబరు 12వ తేదీన బరంపురంలో జన్మించారు.

ఆ రోజుల్లో ఆడపిల్లలు హైస్కూలు చదువులు చదువుకోవడానికి బరంపురంలో అవకాశాలు వుండేవి కావు. లక్ష్మీబాయి చదువుమీదున్న ఉత్సాహంతో కాశీ వెళ్ళి అక్కడ థియసాఫికల్ హైస్కూలులో మెట్రిక్యులేషన్ పాసై, కలకత్తాలో డైసషన్ కాలేజీలో ఎఫ్. ఎ. చదువుకున్నారు.

అప్పట్లో దేశ స్వాతంత్ర్యం కోసం నాయకులు చేస్తున్న కృషి, కాంగ్రెస్ ఉద్యమాలు లక్ష్మీబాయిని ఎంతగానో ఉత్తేజపరచాయి. ఆమె ఉత్సాహానికి తోడుగా అప్పటికే మదరాసు శాసనసభ సభ్యులుగా ఉన్న తండ్రి శ్రీ జోగయ్య పంతులు, ఉద్యమాలలో ప్రధాన బాధ్యతలు నిర్వహిస్తున్న పెద్దన్నయ్య శ్రీ వి. వి. గిరిగార్ల ప్రోత్సాహం కూడా లభించింది. 1926లో ఆమె కాంగ్రెస్ ఉద్యమంలో చేరి, విదేశీ వస్త్ర దుకాణాల వద్ద, కల్లు దుకాణాల వద్దా 'పికెటింగ్' చేశారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు.

1930లో బ్రిటిష్ ప్రభుత్వ నిషేధం అమలులో ఉన్నప్పుడు ఆమె ఎంతో సాహసంతో కుదళాలో జరిగిన గంజాం రైతుల సమావేశానికి అధ్యక్షత వహించారు. ఆ రోజుల్లోనే కాంగ్రెస్ కమిటీకి కూడా అధ్యక్షురాలిగా పనిచేశారు.

ఈ ఉద్యమాలలో పాల్గొన్నందుకు ఫలితంగా 1932లో ఆమెకు 18 నెలలు కఠిన కారాగార శిక్ష లభించింది. ఆ తర్వాత 40లోను, 42లోను మళ్ళా అరెస్టయి, ఒక సంవత్సరం కటక్‌లో జైలు శిక్షలు అనుభవించారు.

1936లో ఒరిస్సా రాష్ట్రం ఏర్పడిన తర్వాత ఆ మరుసటి సంవత్సరం జరిగిన ఎన్నికలలో శ్రీమతి లక్ష్మీబాయి — ఒరిస్సా శాసన సభకు బరంపురం నుంచి పోటీచేసి — ఎన్నికయ్యారు. ఆ తర్వాత '46లో పోటీలేకుండా శాసనసభకు ఎన్నికై వరుసగా 12 సంవత్సరాలు సభ్యురాలిగా ఉన్నారు. ఒరిస్సా శాసనసభకు డిప్యూటీ స్పీకర్‌గా 7 సంవత్సరాలు పని చేశారు.

స్వాతంత్ర్యానంతరం ఆమె వివిధ సంక్షేమ సంస్థలలోను, సాంఘిక కార్యక్రమాలలోను నిర్వహించిన పదవులు అనేకం.

శ్రీమతి లక్ష్మీదేవి దేశసేవను గుర్తించిన ఒరిస్సా ప్రభుత్వం వారు ఆమెకు తామ్ర పత్రాన్ని బహూకరించారు.

77 సంవత్సరాల వయసు వచ్చినా — అనారోగ్యంగా ఉన్నా, ఇప్పటికి సాంఘిక సేవా కార్యక్రమాలలో కృషిచేసేవారికి తగిన సలహాలు ఇస్తూ, యువతరాన్ని దేశాభ్యుదయ కృషిలో ముందుకు నడిపించడానికి ఆమె ఎంతో ఉత్సాహాన్ని చూపుతూ వుంటారు.

శ్రీమతి లక్ష్మీబాయి సంఘసేవలను గుర్తించి-బరంపురం ఆంధ్ర మహిళాసంఘంవారు, నారీ సేవాసంఘంవారు ఇటీవలే ఆమెకు ఘనంగా సన్మానాలు జరిపి, ఆమె కృషిని ఎంతగానో శ్లాఘించారు.

—వరహగిరి సత్యాబాయి

# అమెరికాలో తెలుగు వనితలు

**అమెరికా దేశంలోని న్యూయార్క్, హెూబోకెన్ పట్టణాలల్లో నివసిస్తున్న మన తెలుగు వనితలు ఇద్దరు– అక్కడి వారి దైనందిన జీవితం గురించి చెబుతున్నారు. విదేశాల్లో వుంటున్న మనవాళ్ళు అక్కడ తమ జీవితాలను ఎలా గడుపుతారో ఈ రెండు వ్యాసాలూ చెబుతాయి. ఈ రెండు వ్యాసాలూ 'వనిత' ప్రత్యేకంగా సేకరించినవి:**

"గత ఐదు సంవత్సరాల నుంచీ మేము ఇక్కడే వుంటున్నాము. అంటే, 1969లో ఇక్కడికి వచ్చాము. కొంతకాలం కనక్టికట్ రాష్ట్రంలో వుంది. 70లో న్యూయార్క్ పట్టణానికి వచ్చేశాము. ఈ నగరంలో 'క్వీన్స్' అనే ప్రాంతం వుంది. ఆ ప్రాంతంలోని 'ఉడ్‌సైడ్' అనే కౌంటీలో వుంటున్నాము.

మావారు – యునైటెడ్ నేషన్స్‌లో న్యాయ సలహాదారుగా పనిచేస్తున్నారు. అంతకు పూర్వం, కెనడాలోని క్వీన్స్ యూనివర్శిటీలో కొన్నాళ్ళు, కనెక్టికట్‌లోని ఏల్ యూనివర్శిటీలో కొన్నాళ్ళూ న్యాయ శాస్త్రంలో అధ్యాపకుడిగా పనిచేశారు.

మేము ఇక్కడికి వచ్చినపుడు మా పాపకి 2 నెలల వయసు. మా పాపకు 'బేబిసిట్టర్' చూడాలన్న సమస్య. ఇంటి పనులన్నీ మనమే చేసుకోవలసిన అగత్యం–వుండడం వల్ల నేను ఉద్యోగానికి ప్రయత్నించలేదు. అయితే, మా పాపతోపాటే, మరికొందరు పిల్లల్ని మాతో పెట్టుకుని నేను 'బేబీసిట్' చేసేదాన్ని. దానివల్ల నాకు కొంత రాబడి వుండేది. మన పిల్లల్ని మనం చూసుకుంటూ చెయ్యగలిగే ఉద్యోగం ఇదొక్కటే. ఆ రాబడి మా కారు ఖర్చుకు సరిపోతుంది.



మా అమ్మాయి గీత తన నాలుగో సంవత్సరంలో 'కిండర్ గార్టెన్'కు వెళ్ళింది. తర్వాత, మన ఇండియన్స్ నడుపుతున్న మాంటిసరీ స్కూలుకు వెళ్ళింది. ఇక్కడి చదువులు బాగుంటాయి. కొత్త కొత్త విధానాల్లో చదువులు చెబుతారు. బట్టీలు పెట్టించడం, కాపీలు రాయించడం వంటివి ఏమీ వుండవు. నా చిన్నతనంలో నేను నేర్చుకున్న చదువుకి, ఇక్కడి చదువుకి ఎంతో తేడా కనిపిస్తుంది. అయితే, పెద్ద క్లాసులకు వెళ్ళి చదువుకునే వాళ్ళని చూసినపుడు మాత్రం, మన దేశంలోని విధానాలే నయంగా కనిపిస్తాయి.

వీళ్ళకి డిగ్రీల మీద మోజులేదు. చదువుకోడం కేవలం ఉద్యోగం చెయ్యడం కోసమే. అంచేత, తను చెయ్యాలనుకుంటున్న వుద్యోగానికి ఎంత చదువు కావాలో, అంతవరకే చదువుకుంటారు.

మా నిత్య జీవితాలు మామూలుగానే, యాంత్రికంగా కనిపిస్తాయి. ఉదయం లేవడం, మా వారిని ఆఫీసుకు పంపడం, పిల్లల్ని స్కూళ్ళకు పంపడం, (ప్రతి నిమిషం టైమ్ చూసుకుంటూ పరుగెత్తవలసిందే. ఎంచేతంటే, వాళ్ళ స్కూలు బస్ వచ్చి పది సెకెండ్లు గుమ్మందగ్గర నిలుస్తుంది. అప్పటికి పిల్లలు రెడీగా లేకపోతే, అంతే. పోలోమంటూ తల్లులు తీసుకెళ్ళాల్సిందే) వంటా వార్పు, లాండ్రీలకి బట్టలు వేసుకోడం–అన్నీ మామూలుగానే ఉంటాయి. అయితే, మనకి ఉన్న కొన్ని బాధలు ఇక్కడ లేవు గనుక –కొంత హాయిగా ఉంటుంది. పని మనిషి రాలేదనో, పాలవాడు ఆలస్యం చేశాడనో, కొళాయిలో నీళ్ళు రాలేదనో– అన్న బాధలు లేవు. ఈ బాధలు, భయాలు మనకి ఎక్కువ. అసలు పని వాళ్ళే లేనప్పుడు, వాళ్ళు రాలేదనే బాధ ఎక్కడుంటుంది? – పాలు, తదితర నిత్యావసర వస్తువులూ, ఎప్పుడూ దొరుకుతాయి. కాబట్టి, ముందే తెచ్చుకుని ఉంచుకోవచ్చును; లేదా అప్పటి కప్పుడు వెళ్ళి తెచ్చుకోవచ్చును.

ఉదయమే పిల్లలు, ఆఫీసులకు వెళ్ళవలసిన వాళ్ళు 'బ్రేక్‌ఫాస్ట్' తీసుకుని వెళతారు. ఇక్కడ పళ్ళరసాలు సమృద్ధిగా దొరుకుతాయి. అంచేత, ఉదయమే బ్రేక్‌ఫాస్ట్‌తో పళ్ళరసం తీసుకుంటాం. బ్రేక్‌ఫాస్ట్‌లో బ్రెడ్, ఆమ్‌లెట్లు – ఉంటాయి. మధ్యాన్నం 'లంచ్'లో సాండ్‌విచెస్ వంటివి చేసుకుంటాము. సూప్, పళ్ళు ఉంటాయి. రాత్రులు మాత్రం–మన భోజనమే.

అమెరికా దేశం అంతటా ఇలాగే దొరుకుతాయా అంటే చెప్పలేనుగాని, మా వూళ్ళో మాత్రం దొరకని వస్తువు అంటూలేదు; తాజాకూరగాయలు, ఆకుకూరలు, దుంపకూరలు అన్నీ పుష్కలంగా దొరుకుతాయి. ఈ మధ్యన మా వారు బజారుకు వెళ్ళి అరటిపువ్వు, పనసకాయా కనిపించాయని, కొని తీసుకొచ్చారు కూడా! అయితే, మనవేపు దొరికే కొన్ని కాయగూరలు ఇక్కడ దొరకవు. పొట్ల, దొండ, బీర–వంటివి దొరుకుతాయి గాని, ఇక్కడి రకం దొరుకుతాయి. ఇవి కాకుండా, డబ్బాల్లో ఉండే (కాన్‌డ్ ఫుడ్స్) కూరగాయలు ఎప్పుడూ దొరుకుతాయి. మనం వండుకునే వంటలాగే చేసుకుని, తిరగమోత పెడితే రుచిలో గాని, తాజాదనంలో గాని, ఏమీ తేడా తెలీదు. కొన్ని సీజన్స్‌లో మామూలు కాయ గూరలకన్న, 'కాన్‌డ్'వి చవగ్గా ఉంటాయి. ఇవి వండడం కూడా సులభమే.

కూరగాయలు పెరళ్ళలో పెంచడం అందరికీ సాధ్యం కాదు. సొంతంగా ఇల్లున్న వాళ్ళూ, పెద్ద ఇల్లున్నవాళ్ళూ కూరగాయలు పండించుకుంటారు. విశేషం ఏమిటంటే–అలా పండిస్తున్న చాలా పెరళ్ళలో (అమెరికన్లవే) మన 'గోంగూర' బాగా కనిపిస్తుంది!

సాధారణంగా నాకు తీరిక అంటూ కనిపించదు. కనిపిస్తే మధ్యాన్నం వేళలోనే. అప్పుడు టెలివిజన్ చూస్తూ కూచుంటాము; పత్రికలు

చదువుతాను. స్నేహితులకు ఎవరికైనా టెలిఫోన్ చేసి, కాస్సేపు కబుర్లు చెబుతాను. తెలుగు పత్రికలు ప్రత్యేకంగా స్టాల్స్‌లో దొరకవు. ఇండియాకు వెళ్ళినపుడల్లా—ఉన్న పత్రికలన్నీ పెద్ద పాకెట్ కట్టి, తెచ్చుకుని, చదువుకుంటాను. పాపం. మా వాళ్ళు పత్రికలన్నీ నా కోసం అని, జాగ్రత్త చేస్తూ ఉంచుతారు. ఎంబ్రాయిడరీ పని చేయడం, ఉత్తరాలు రాసుకోవడం చేసుకుంటాను. మరీ తీరిక అనిపిస్తే—వడియాలు పెడతాను, చేగోడీలు, జంతికలు వంటివి చేస్తాను.

పండగలు మేము చేసుకుంటాం. సాధారణంగా పండగరోజున 'తెలుగు అసోసియేషన్' వారు పిక్నిక్‌లు, సమావేశాలూ ఏర్పాటు చేస్తారు. అందరమూ అక్కడ కలుసుకుని, హాయిగా గడిపేస్తాం. వెళ్ళడానికి వీలు లేకపోతే, ఇంట్లోనే జరుపుకుంటాము. వినాయక చవితికి—మా పూజా మందిరంలో వున్న వినాయకుడికి పూజలు చేస్తాం; ఉండ్రాళ్ళు నైవేద్యం పెడతాము. దీపావళికి, పటాసులూ అవీ కొంటాము. ఉగాదినాడు ఉగాది పచ్చడి చేస్తాను. అంతకంటే సాంప్రదాయికంగా చెయ్యలేము. చిక్కు ఎక్కడ వస్తుందంటే. వినాయక చవితినాడు—మా వారు రకరకాల పువ్వులు, పత్రికోసం వేటాడతానంటారు. గులాబీలు, చేమంతులు ఖరీదు ఎక్కువైనా — దొరుకుతాయి. పత్రులు అవే కావాలంటే ఎక్కడ దొరుకుతాయి? అంచేత, దొరికినంత వరకూ ఏవో నాలుగు రకాల ఆకులు తెచ్చి, పూజ చేస్తాం. అలాగే, ఉగాది వస్తే వేపపువ్వు దొరకదు. ఎండబెట్టి తెచ్చుకున్న వేపపువ్వు అందులో వేసేస్తాం. చేదు అటే ఉండక పోవడం వల్ల అసలు రుచి రాదు. "ఏమిటే ఇలా ఉంది?" అంటారు మా వారు. "ఈ సంవత్సరం మనం "చేదు" చూడం అన్నమాట. అందుకు సంతోషించరేం!" అంటాను నేను.

న్యూయార్క్‌లో — పెద్ద దేవాలయం కడుతున్నారు. మన ఆంధ్ర ప్రభుత్వంవారూ, తిరుపతి దేవస్థానంవారూ ఎంతో ప్రోత్సాహం ఇచ్చారు. హిందువులందరూ చందాలు వేసి, ఇక్కడ వున్న ఒక చర్చినే, మన దేవాలయంగా మార్చి ప్రస్తుతానికి వాడుతున్నారు. ఇక్కడ వ్రతాలు, పూజలు, వివాహాలూ జరుగుతూవుంటాయి. మావారు, ప్రతి రోజూ స్నానానంతరం, పూజా మందిరం దగ్గర ప్రార్థన చేసి గాని, ఏపనీ ప్రారంభించరు. శనివారం వస్తే, అందరమూ పూజ చేసుకుంటాము.

సెలవు రోజుల్లో, అందరమూ కలిసి పార్కుకో, జూకో, సినిమాలకో వెళ్తాం. లేకపోతే, కార్లోనే కొంతదూరం కబుర్లు చెప్పుకుంటూ వెళ్తాం. 'తెలుగు లిటరరీ అండ్ కల్చరల్ అసోసియేషన్' వారి కార్యక్రమాలు వుంటే తప్ప, తక్కిన సమయాల్లో తెలుగువాళ్ళందరూ కలుసుకునే వీలు వుండదు. పిల్లల 'బర్త్‌డే'లు వస్తే మాత్రం స్నేహితులను పిలుస్తాం. పేరంటాళ్ళను పిలవడం వంటివి వుండదు. పిల్చినా, తాంబూలం ఇవ్వడం వుండదు. తమలపాకులు దొరకవు గనక!

అందరమూ కలుసుకుంటే, మా మాటలు మామూలే. ఆడవాళ్ళందరూ చీరెలు, నగలూ, పిల్లల బట్టలూ, బంధువులూ, వంటలు, చూసిన ప్రోగ్రామ్స్ — వీటి గురించి మాట్లాడుకుంటాం. మగవాళ్ళయితే, రాజకీయ విషయాలు మాట్లాడుకుంటారు.

ఎంతయినా, ఏమైనా—తెలుగు దేశంలో వున్న మన వాళ్ళందరితో మెలగాలనీ, అందరితో కబుర్లు చెప్పాలనీ ఎప్పుడూ అనిపిస్తూనే వుంటుంది. అందుకే మనదేశం వచ్చినప్పుడే—మాకు పెద్ద "పండగ"లా అనిపిస్తుంది!

—కొల్లూరు విజయలక్ష్మి వెంకట్రామన్
(న్యూయార్క్)

"**హ**ొబొకెన్" ...

"మేముండేవూరు న్యూయార్క్ నగరానికి మైలు దూరంలో వుంది. ఇది పట్టణమే. 'హోబోకన్' అని పేరు. 30 వేలమంది జనాభా. అందులో రెండు వేలమంది భారతీయులు.



నాలుగు సంవత్సరాలుగా మేము ఇక్కడ వుంటున్నాము. మావారు గ్రాడ్యుయేట్ టీచింగ్ అసిస్టెంట్‌గా వుంటూ, పి హెచ్. డి. చేస్తున్నారు. నేను ఇంట్లోనే వుంటూ ఇద్దరు పిల్లల్ని చూసుకుంటున్నాను. (మా అమ్మాయితో కలిసి ముగ్గురు) ఆ అబ్బాయీ అమ్మాయీ ఉదయం ఎనిమిది నుంచీ సాయంకాలం ఆరున్నరవరకూ మా ఇంట వుంటారు. అబ్బాయి చైనా దేశస్థుడు; అమ్మాయి పంజాబీ.

మేము ఉదయం ఏడు గంటలకు లేస్తాము. మా అమ్మాయి ఉష 8.15 కల్లా స్కూలుకు సిద్ధం కావాలి. అంచేత, ఉదయం పూట హడావిడిగానే వుంటుంది. మా అమ్మాయిని మావారే స్కూలుకు దిగబెట్టి, ఆయన యూనివర్సిటీకి వెళ్ళిపోతారు. మా అమ్మాయి మొదటి తరగతి చదువుతోంది. మేము యూనివర్సిటీ ఆవరణలోనే వుంటున్నాము కాబట్టి — మధ్యాన్నం మా వారు భోజనానికి ఇంటికే వస్తారు.

ఆ ఇద్దరు పిల్లలూ మూడేళ్ళలోపు వారు. వాళ్ళ అవసరాలన్నీ మేమే చూడాలి. మధ్యాన్నం పూట వాళ్ళు నిద్రపోతారు. అప్పుడు నాకు కాస్త తీరిక దొరుకుతుంది. ఆ టైమ్‌లో టి. వి. లో వచ్చే 'సీరియల్స్' చూస్తాను; పత్రికలు, పుస్తకాలూ చదువుతాను. మధ్యాన్నం ఓగంటసేపు సంగీత సాధన చేస్తాను. వారాంతంలో మేము ఎక్కడికైనా వెళ్ళడమో, ఎవర్నయినా మా యింటికి పిలవడమో చేస్తూవుంటాము.

ఐదేళ్ళలోపు వయసుగల పిల్లలకి రోజూ రెండు గంటలకన్న ఎక్కువసేపు స్కూలు వుండదు. క్లాసులో 20 మందికన్నా ఎక్కువ మంది వుండడానికి వీల్లేదు కాబట్టి, వున్న వాళ్ళ మీద బాగా శ్రద్ధ తీసుకుంటారు. పిల్లలు టి. వి. ల ద్వారా కూడా కొంత నేర్చుకుంటూ వుంటారు.

మేము శాకాహారులం. అంచేత, మాకు కావలసిన వస్తువులు దొరకడం కాస్త కష్టమే. రోజూ రొట్టెలు, బ్రెడ్, దోసెలు వంటివి తింటాము. వేసవి కాలంలో తప్ప తక్కిన వారాల్లో కూరగాయలు మాకు బాగా దొరకవు. కాకరకాయలు, బెండ, ఆనప తాజావి దొరుకుతాయి. 'చీజ్' తింటాము. పళ్ళు తింటాము. బజార్లలో దొరికే తినుబండారాలు చప్పగా వుంటాయి. మిరియాల పొడి, ఉప్పు—తప్ప ఇంకేమీ వెయ్యరు. అంచేత, అవి మనకు ఏ మాత్రమూ రుచిగా వుండవు. అంచేత, ఎప్పుడూ ఇంట్లోనే చేసుకుంటాము. 'కాన్‌డ్' ఫుడ్స్ ఇక్కడ ఎక్కువగా వాడరు. బ్రహ్మచారులు, భార్యా భర్తలు ఇద్దరూ ఉద్యోగాలు చేసేవాళ్ళే ఐతే వాడతారు. సొంత ఇళ్ళున్న వాళ్ళు తప్పితే - తక్కిన వాళ్ళకు కూరగాయల మొక్కలు పెంచడం కుదరదు.

# దీపాల ముగ్గు

**దీపావళి సందర్భంగా వెయ్యదగ్గ ఒక అందమైన ముగ్గు వేసే పద్ధతిని ఇక్కడ తెలుసుకుందామా ?**

1



ఈ ముగ్గులో అందమైన దీపాలు దీపావళి శోభను విరజిమ్ముతూ కనిపిస్తాయి.

ఈ ముగ్గు వెయ్యడానికి మొదట ఒక వరుసలో ఒకదానికొకటి సమాన దూరంలో ఉండేలా 21 చుక్కలు ఉంచాలి. ఆ తర్వాత ఆ వరుసకు ఇటూ అటూ ప్రతి వరుసకు రెండేసి చుక్కల చొప్పున తగ్గిస్తూ–అలా రెండువైపులా ఒక్క చుక్క వచ్చేదాకా చుక్కలు ఉంచాలి. (చిత్రం - 1 చూడండి).

ఆ తర్వాత ఈ వరుసలలోని చుక్కలను చిత్రం–2లో చూపినట్లు కలిపి పువ్వులూ, దీపాలూ, స్వస్తిక్ ఆకారాలూ రూపొందించితే ఈ ముగ్గు పూర్తవుతుంది.

ఈ ముగ్గును రకరకాల రంగులతో అలంకరిస్తే బావుంటుంది.

—వసంత

2



పండగలు అందరితో కలిసి చేస్తేనే సందడిగా వుంటుంది. తెలుగు సంఘం వారి కార్యక్రమాలకు వెళ్తే బాగానే గడుస్తుంది. కాని, మాకుగా చేసుకోవాలనిపించదు. ఆయా పండగల్లో మన దేశంలో ఏం చేసుకుంటామో, ఆ విషయాలు మాత్రం మా అమ్మాయికి చెబుతూ వుంటాను. అంతే. వస్తువులన్నీ దొరుకుతాయి కాబట్టి, మనకి కావలసిన వంటలన్నీ చేసుకోవచ్చు. పూజ గదికి మా యింట్లో అవకాశం లేదు. మా ఇల్లు చెక్కతో కట్టిన ఇల్లు. ఓ పక్క దేవుడి పటం వుంటే, అక్కడే పూజ చేస్తాను. మరీ వెళ్ళాలనుకుంటే, న్యూయార్క్‌లో వున్న హరేకృష్ణ గుడికి వెళ్తాము.

సెలవు రోజుల్లో సాధారణంగా అందరమూ కలుసుకుంటాము. పిక్నిక్‌లూ అవీ వుంటాయి. ఇందులో 99 మంది భారతీయులమే వుంటాము. తెలుగు వాళ్ళం కలుసుకున్నప్పుడు, ఎక్కువగా మనదేశం, మన ఆచార వ్యవహారాలూ, మన ముచ్చట్లు చెప్పుకుంటాము.

నాకూ మా వారికీ సంగీతం, నాట్యం అంటే ఇష్టం. తమిళ సంఘం వారి కచ్చేరీలలో కూడా నేను పాల్గొన్నాను। ఇలాంటి కచేరీలకు వెళ్తాము. అప్పుడప్పుడు అమెరికన్ చిత్రాలకు వెళ్తాము. మన తెలుగు సినిమా చూసి చాలా కాలమైంది.

మేమూ, మా విధానాలు ఏమీ మారలేదు. నూటికి నూరుపాళ్లూ భారతీయుల్లాగే కనిపిస్తాము. మన వూళ్ళలోలాగా గొడవలు, చిలవలూ పలవలూ చెప్పుకోడం ఏమీ వుండదు. ఒకరి కుటుంబ విషయాల్లో ఇంకొకరు జోక్యం చేసుకోరు. కాఫీ పొడి కోసం గరిట పట్టుకుని పక్క యింటికెళ్ళే అవసరం లేదు కాబట్టి–వాళ్ళచేత 'మొట్టికాయలు' తినే అవసరమూ లేదు।

అమెరికన్ల దగ్గర్నుంచి నేర్చుకోవలసినవి కొన్ని వున్నాయి. తక్కువ పిల్లలు వుండడం, పిల్లల పెంపకం, భార్యా భర్తలు ఒకరి మీద ఒకరికి గౌరవ భావాలు వుండడం, ఇతరుల గురించి తక్కువ చేసి మాట్లాడకపోవడం-వంటివి. "ఏ దేశమేగినా, ఎందుకాలిడినా...." అని రాయప్రోలు వారు అన్నట్టుగా – ఆ మాటలు గుర్తు తెచ్చుకుంటూ ఇక్కడ కాలక్షేపం చేస్తున్నాము."

—ప్రభా రఘునాథ్ (హొబోకన్)

# నిప్పులేని పొగ



గోపాలం ఆఫీసునుంచి వచ్చి సైకిల్ ఇంట్లో పెట్టాడో లేదో కమల అందుకొంది.

"[illegible] చూశారా ఈ [illegible]తం... ఆయనెవరో పెద్ద ఆఫీసరనుకున్నాం. ఆఫీసరూ కాదు. పాడూ కాదు. ఆయన కేవలం మామూలు గుమాస్తా. ఆ వచ్చే జనమంతా ఆయనకోసం కాదు. ఆవిడకోసమట." అంటూ ముందుగా బుగ్గలు నొక్కుకుని, ఆ తర్వాత ముక్కు మీద వేలేసుకుంది.

"ముందు ఆ ముక్కుమీద వేలుతీసి, సంగతేమిటో సరిగా చెప్పు. ఎవరా ఆఫీసరు? ఎవరావిడ? ఎవరా జనం?" అంటూ ప్రశ్నల పరంపరని వదిలాడు గోపాలం, ప్రశ్నోపనిషత్తులోని శిష్యుడిలాగా.

"హయ్యో రామ....మీకు ఇంత చెప్పినా తెలీదేమిటండీ! నా కర్మకొద్దీ దొరికారు. హుఁ.....

ఆయనేమండీ [illegible] వచ్చారా వాళ్ళు. [illegible] ఆయనింటికి వచ్చే జనాన్ని చూసి ఆయన్ని పెద్ద ఆఫీసరనుకున్నాం. అసలు బండారం ఇది" అంది కమల – అసలే పెద్ద కళ్ళను మరింత పెద్దవి చేస్తూ. ఆమాటలు చెపుతుంటే, ప్లవన సూత్రాన్ని కనిపెట్టినప్పుడు ఆర్కిమెడీస్‌కి కలిగినంతటి ఆనందం, ఆమె ముఖంలో తాండవించసాగింది.

"ఇంకా నయం. ఈమాటలు చెప్పి వెర్రి కేకలు వేస్తూ వీధుల్లో పరిగెత్తింది కాదు" అనుకున్నాడు గోపాలం తనలోనే.

"ఇంతటి చిదంబర రహస్యాన్ని నీ చెవిన వేసిందెవరు చెప్మా?" అంటూ నవ్వుతూ అడిగాడు.

"చెప్మాలేదు – ఉప్మాలేదు. మీకన్నీ వేళా

కంచి రమాదేవి

కోవాలే. అందులో నా మాటలంటే మరీనూ.... వేళాకోళానికేనా వేళాపాళా ఉండాలి. హద్దూ పద్దూ ఉండాలి'' అంది కమల చిరుకోపంతో.

''ఏపద్దు చాకలిపద్దా?'' అని మళ్ళీ అడిగాడు గోపాలం కవ్విస్తూ.

కమలకి నవ్వు ఆగలేదు. చిటికెలో కోపం ఎగిరిపోయింది. ''మీదారేవేరు. ఏడ్చేవాళ్ళని కూడా ఇట్టే నవ్విస్తారు'' అంది.

''లేకుంటే నవ్వేవాళ్ళని చూసి ఏడవమంటావా?'' అన్నాడు గోపాలం.

''మీకు నేను సమాధానం చెప్పలేను బాబూ....'' అంది కమల భ్రుకుటి ముడివేస్తూ.

''సమాధానం చెప్పొద్దులేకాని సమాచారం చెప్పు. ఇంతకీ ఆ చిదంబర రహస్యం నీకెలా తెలిసింది?'' అన్నాడు గోపాలం.

''ఆయన మొన్ననగా ఊరెళ్ళాడుట. నిన్న రాత్రి ఎవరో ఇద్దరు స్కూటరు మీద వచ్చారుట. పొరపాటున పక్కింటి తలుపు తట్టారుట. విమలమ్మగారు తలుపుతీసి కొత్తవాళ్ళని చూసి విస్తుపోయిందట. అప్పుడు మాటల్లో తెలిసిందట వాళ్ళు వచ్చింది పక్కింటి కోసం అని. అక్కడికీ పాపం ఆమె చెప్పిందట, ఆయన ఊరెళ్ళారండీ అని. అందుకు వాళ్ళు "పర్వాలేదు లెండి. అమ్మగారితో మాట్లాడుతాం'' అని పక్కింట్లోకి వెళ్ళారుట. లోపలకి పోయి ఏదో బుట్టని ఆవిడకి ఇచ్చి కొంచెంసేపు ఏదో గుసగుసలాడారుట. తర్వాత బయటికి వచ్చి 'మళ్ళీ వస్తాం' అంటూ వెళ్ళిపోయారుట!'' కథ చెప్పినట్లుగా చెప్పింది కమల.

''అయ్యాయా నీ'టా'లు? ఆ విమలమ్మగారొచ్చి ఈ కమలమ్మగారి చెవిన వేసిందన్న మాట ఈ రహస్యం'' అన్నాడు గోపాలం హాస్యంగా.

''మీకు అలాగే ఉంటుంది. గుడి పాములాగా ఇంట్లోనే కూర్చుంటాను నేను. అందువల్ల నాకన్నీ చివరికే తెలుస్తాయి. మీకు తెలిసినా నాకు చెప్పరాయె. నాకంటే ముందే ఈ విషయం కాలనీ అంతా పాక్కిపోయింది. అందరినోటా ఇదే మాట'' అంది కమల.

''ఇందులో చెప్పుకోడానికేముందే—ఆయన నిజంగానే ఆఫీసర్ అయి ఉండొచ్చుగా? వాళ్ళు ఆయన కోసమే వచ్చి ఆ కానుకను తెచ్చి ఉండొచ్చుగా. ఆయనలేరని తెలిసి, అదేదో ఆమెకే ఇచ్చి మళ్ళీ వస్తామని వెళ్ళిపోయుండొచ్చుగా'' అన్నాడు గోపాలం తర్కికంగా.

''అయ్యాయా మీ'డొచ్చు'లు! అయినా మనిషినిచూస్తే తెలీటంలేదుటండీ ఆమె ఎటువంటిదో? నడివయస్సులో ఉన్నా ఆ వాలుజడేమిటి, ఒళ్ళు కనిపించే ఆ బట్టలేమిటి, ఆ మెషీన్ బాడీలేమిటి, ఆ పౌడరు అద్దుకోవడం ఏమిటి? తలనిండా ఆ మల్లెపూలు ఏమిటి? ఆమెలో ఎక్కడైనా సంసార లక్షణాలు ఉన్నాయా?'' అంటూ మాటకి మాట అంటించి, తర్కం మొదలు పెట్టింది కమల.

''వేషాలకేమిటే ఈ రోజుల్లో ముసలి అవ్వలు కూడా వేస్తున్నారు. అదంతా ఈ రోజుల్లో ఫేషన్. ఇంటి వెనకనే మల్లెతోట ఉంది కనుక పూలు పెట్టుకుని ఉంటుంది. డబ్బుంది కనుక ఖరీదు బట్టలు కొనిక్కుని ఉంటుంది. ఇంత మాత్రానికే ఆమెని బజారుపాలు చేయాలా?'' అన్నాడు గోపాలం.

''ఏం! ఆమెని ఇంతగా వెనకేసుకొస్తున్నారు—ఆమె సంగతి బాగా తెలిసినట్లుగా'' అన్నది కమల భర్త వంక అనుమానం చూపులు సారిస్తూ.

''కొంపతీసి నన్ను మాత్రం అనుమానించకు. అది సరే గాని ఆమె కోసం వచ్చేవాళ్ళు పోయేవాళ్ళు అయితే కలిసి ఎందుకు వస్తారే .... విడివిడిగా వస్తారు కాని" అన్నాడు గోపాలం తల గోక్కుంటూ.

''మీదంతా అదో చాదస్తం. తెగించిన దానికి ఒకళ్ళేమిటి — ఇద్దరేమిటి? పట్టపగలే పది మంది వస్తూంటారు. వాళ్ళకి కాఫీలు ఇస్తూ, వాళ్ళతో నవ్వుతూ మాట్లాడడం నేనూ చూశాను. బజారున పడ్డదానికి పగలేమిటి రాత్రేమిటి?'' ఉత్సాహంగా చెప్పుకుపోతూంది కలమల.

''భర్త ఉండగానే ఆమె అలా చేస్తూండడం నేనూ చూశాను. అందులో తప్పేముంది? ఆమె బాగా చదువుకున్నదై ఉంటుంది. ఘోషా లేకుండా నలుగురితో మాట్లాడుతూ, ఇంటికొచ్చిన అతిథులకు మర్యాదలు చేస్తూ ఉండి ఉంటుంది,'' అన్నాడు గోపాలం.

''ఆ....ఆ....తెల్లనివన్నీ పాలూ, నల్లనివన్నీ నీళ్ళూ అనుకునే స్వభావం మీది. పిల్లి కళ్ళు మూసుకు పాలు త్రాగుతూ తనెవ్వరూ చూడడం లేదనుకుంటుందిట. నిప్పు లేందే పొగ వస్తుందిటండీ! నిజం ఎన్నాళ్ళు దాగుతుంది!'' అంటూ ఏకధాటిన మహోపన్యాసకురాలిలాగా మాట్లాడింది కమల.

''ఆగాగు....పాలనీ పిల్లినీ ఒకచోట చేర్చావు. ఇంక వేరే చెప్పనక్కర్లా'' అన్నాడు గోపాలం నవ్వుతూ.

''నా మాటలకి అడ్డురాకండి....ఆ....ఇది విన్నారా?'' అన్నది ఆశ్చర్యంగా ముఖం పెట్టి కమల.

''ఏమిటి మరోరహస్యమా! ఇంకా వినందే'' అన్నాడు గోపాలం.

''చాల్లెండి సరసం....అసలు ఇదంతా ఆ మొగుడికి ఇష్టమేట. వాడు వట్టి వాజమ్మట—పేరుకి మాత్రమే మొగుడట. ఆయనే పెళ్ళాం చేత ఈ వ్యాపారమంతా నడిపిస్తాడట....హవ్వ.... ఈ ఘోరకలి ఎక్కడేనా ఉందా?'' అంటూ మళ్ళీ బుగ్గలు నొక్కుకుంది కమల.

''ఈ పరమరహస్యం కూడా నీకు విమలమ్మగారే చెప్పిందా?'' అన్నాడు గోపాలం కొంచెం విసుగ్గా.

''లేదు....రాజమ్మగారు ఇందాక ఇటువచ్చింది. మాటల్లో ఈ ప్రస్తావన వచ్చేసరికి, ఈ సంగతంతా చెప్పింది. వాళ్ళ ఆయన కూడా అదే ఆఫీసులో పనిచేస్తారుట. ఆయన చెప్పారుట. ఈ విషయాలన్నీ ఆమెకి విమలమ్మకంటే ముందే తెలుసుట. ఇన్నాళ్ళూ కడుపులో దాచుకుందిట'' అంది కమల.

''ఇంకేం!....ఇప్పుడు కక్కేసిందన్నమాట. ఈపాటికి కాలనీ అంతా ముట్టించేసి ఉంటుంది,'' అన్నాడు గోపాలం.

''సంసారుల ఇళ్ళ మధ్య ఈ సాని భాగోతం ఏమిటండీ? ఎప్పుడేం జరుగుతుందోనని తలుచుకుంటే భయం వేస్తోంది'' అంది కమల ఏదో ఆలోచిస్తూ.

''అట్టే వగలుపోకు. మన బంగారం మంచిదైతే మరేం ఫర్వాలేదు. బయటపడేదాకా అందరు స్త్రీలూ పతివ్రతలే, అందరు పురుషులూ పెద్ద మనుషులే!'' అన్నాడు గోపాలం బట్టలు మార్చుకోడానికి పోబోతూ.

''రామ రామ అవేం మాటలండీ, సిగ్గు చేటాని'' అంది కమల నివ్వెరపోయి.

''అవును. అవకాశంలేక, పరువుకు భయపడి, మనందరం, పాతివ్రత్యాన్నీ, ఏకపత్నీ వ్రతాన్నీ నటిస్తున్నాం కాని, అవకాశం ఉండీ, సంఘం దృష్టిలో వ్యభిచారం తప్పుకాకపోతే, అందరూ పెద్దమనుషులే కదూ!'' అన్నాడు గోపాలం సీరియస్‌గా.

భర్త మాటలకి కొయ్యబారిపోయింది కమల. కొంచెం తెప్పరిల్లుకుని "ఛీ... ఛీ....ఏమి మనుష లండీ మీరు? ఏ మాట అనొచ్చో ఏ మాట అన కూడదో కూడా తెలీదు. విన్నవాళ్ళు బాధపడతారన్న ఆలోచనైనాలేదు. అసలు మీలాంటి వితండవాదపు మనుష్యులతో మాట్లాడటం నాదే బుద్ధి తక్కువ. కాళ్ళు కడుక్కుని రండి. కాఫీ ఇస్తాను" అంటూ వంటింటివేపు దారితీసింది.

"నిజమేలే....నిజం ఎప్పుడూ చేదుగానే ఉంటుంది" అంటూ బట్టలు మార్చుకోడానికి వెళ్ళాడు గోపాలం.

*

ఆ రోజు సాయంత్రం .... ఆఫీసు నుంచి వస్తూనే అందుకున్నాడు గోపాలం "అందుకే అన్నారు 'స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః' అని పెద్దలు" అంటూ.

"ఏమైందండీ?" అంటూ ఆత్రంగా అడిగింది కమల.

"ఇంకా ఏం కావాలి? ఇటువంటి నీచపు మాటలు చెప్పి నువ్వూ, విని నేనూ ఇద్దరం పాపం చేశాము. పాపం ఆ ఇల్లాలికి తెలిస్తే ఎంత నొచ్చుకుంటుందో?" అన్నాడు గోపాలం.

"ఎవరండీ? ఆ నాలుగో ఇంట్లో ఉండిన వాళ్ళ గురించేనా మీరు అనడం? వాళ్ళు ఇల్లు ఖాళీచేసి అప్పుడే వారం అయింది" అంది కమల.

"ఖాళీచేయకపోతే, పుణ్యాత్ములున్న ఈ కాల నీలో ఇంకా ఉంటారా? నిజం వింటుంటే నా తల కొట్టేసినట్లనిపించింది" అన్నాడు గోపాలం బాధపడ్తూ.

"ఏమిటో సరిగ్గా చెప్పండీ" అంది కమల ఆందోళనగా.

"ఇందాక మన సుందరం కనిపించాడు. వాడికీ మధ్య ఈ ఊరు బదిలీ అయిందిట. ఇళ్ళ కోసం వెతుకుతున్నాడు. వాళ్ళు ఖాళీచేసిన ఇల్లు ఉంది కదా అని ఆ వివరాలు చెప్పేసరికి, 'బాబోయి నాకా ఇల్లు వద్దు. మీ కాలనీవద్దు' అంటూ సంగతంతా చెప్పాడు. ఆయన నిజంగానే ఆఫీసరుట. వీడూ అదే ఆఫీసులో పెద్ద ఆఫీసరు. వీళ్ళిద్దరికీ ఎప్పటినుంచో మంచిస్నేహం ఉందిట. ఆయన నెలలో ఎక్కువ రోజులు క్యాంపులో ఉంటుంటారుట. ఆయనతో అనేక మంది వ్యాపారస్థులకీ, పెద్ద మనుషులకీ పని ఉంటూ ఉంటుందిట. అందు కోసం తరుచూ వాళ్ళు ఆయన ఇంటికి వస్తుంటారుట. వచ్చేవాళ్ళు ఆయన ప్రాపకం కోసం ఏవో కానుకలు తెస్తుంటారుట. అయితే ఆయన తరుచు కాంపులో ఉంటూండడంలో, వాళ్ళు తాము తెచ్చిన వాటిని ఆమెకిచ్చి, తమ అవసరాలను ఆమెకి చెప్పుకుంటూంటారుట. ఆమె మర్యాదస్థురాలూ, బాగా చదువుకున్నదీ అవడంతో వచ్చినవాళ్ళని కూర్చోపెట్టి కాఫీలూ అవీ ఇచ్చి మర్యాద చేసి పంపిస్తుంటుందిట. పైగా భర్తద్వారా పరిచయం అయిన అనేక మంది కుటుంబ స్నేహితులతో ఎక్కువ సేపు మాట్లాడుతూ ఉంటుందిట. పాపం-భర్త ఊళ్ళో లేనప్పుడు ఆమెకి మరో కాలక్షేపం లేదాయె. పట్నాలలో పుట్టి పట్నాలలో పెరిగిన ఆమె సహజంగానే బాగా ఖాళీ చేసుకుని నలుగురితో చనువుగా మాట్లాడుతుంది. ఆమె వేషం మనకి ఎబ్బెట్టుగా కనిపించవచ్చు. ఇంత మాత్రానికే మనకాలనీ వాళ్ళు ఆమె మీద నిందలు వేసి, దుష్ప్రచారం చేశారు. ఇల్లు విడిచి బయటికి వెళ్ళని ఆమె చెవిన ఈ మాటలు పడలేదు కాని, బయట తిరిగే ఆయన చెవిని పడ్డాయి. అందుకే ముందు జాగ్రత్తపడి, ఈ దుష్ప్రచారం ఆమె చెవిదాకా రాకముందే ఇల్లు ఖాళీ చేసి వెళ్ళిపోయాడుట. ఈ విషయాన్నే కక్కలేక మింగలేక బాధపడ్తూ, దగ్గర స్నేహితుడు సుందరం ముందు వెళ్ళబోసుకుని భోరుమన్నాడుట. ఇందాక సుందరం చెప్తుంటే సిగ్గుతో తల దించుకున్నాను" అన్నాడు గోపాలం ఆవేదనతో.

కమల ముఖంలో కూడా ఆవేదన ప్రస్ఫుటంగా గోచరించింది.

"అదేమిటండీ....ఆయన ఆఫీసర్ కాదనీ, మామూలు గుమస్తా అనీ ఏవేవో చెప్పారు కదండీ!" అంది.

"అవన్నీ కిట్టని వాళ్ళు కల్పించే మాటలు. లేనివి ఉన్నట్లుగానే ఊహించుకునీ, గోరంతలను కొండంతలుగా చిత్రించి సంబరపడడమే ఆడ వాళ్ళకి హాబీ, నిప్పులేని పొగని సృష్టించడంలో వాళ్ళకి వాళ్ళే సాటి. ఈ అమ్మలక్కల మాటల మూలంగా ఎన్ని సంసారాలు కూలిపోతాయో వాళ్ళకి తెలీదు. అందుకే నేనంటా మనబంగారం మంచిదవాలికాని ఇతరుల సంగతి మన కనవసరం అని"....అంటూ బట్టలు మార్చుకోడానికి వెళ్ళాడు గోపాలం.

బరువుగా నిట్టూర్చి కళ తప్పిన ముఖంతో లోనికి వెళ్ళింది కమల. భర్త మాటలే ఆమె చెవిలో రింగుమంటున్నాయి. నిప్పులేని పొగ క్రమ్మినట్లు నీరస పడిపోయింది ఆమె. □



## పుస్తకాలు

### కళ్యాణ ఘడియ; రాగరంజిత
### (రెండు నవలలు)

[ రచన : వింజమూరి లక్ష్మి ; 1/8 క్రౌను సైజులో రెండూ కలిసి **228** పేజీలు. వెల : రూ. **7-50** ; ప్రచురణ : క్వాలిటీ పబ్లిషర్సు, విజయవాడ— **520002** ]

'కళ్యాణ ఘడియ'లో—మానవ సమాజంలో మంచీ చెడూ సమాన స్థాయిలోనే ఉంటాయి. మంచికి గుర్తింపు త్వరలోనే రాకపోయినా, ఆలస్యంగానైనా గుర్తింపబడుతుందన్న అంశమే ఇందులో ముఖ్యంగా చెప్పబడింది. దుష్టగ్రహాల సాంగత్యవల్ల పొరపాటు జరిగినా పశ్చాత్తాపడతాడు ఇందులోని నటరాజ్. అందుకే అతని జీవితం మంచి మలుపుకు తిరుగుతుంది. క్రూరుడూ నీచుడూ అయిన నటరాజ్ ఉత్తముడిగా మార్పు చెందిన కారణంగా అంతకుముందు అతన్ని ఎంతగానో అసహ్యించుకున్న సరోజిని తన జీవిత భాగస్వామిగా ఆహ్వానిస్తుంది. నటరాజ్ జీవిత నావకు చుక్కానియై నిలుస్తుంది సరోజిని. కళ్యాణమొచ్చినా, కక్కొచ్చినా ఆగదనే సామెతను ఋజువు పరుస్తూ అదే తన ఉద్దేశంగా చెప్పారు ఈ నవలా రచయిత్రి. కథ మామూలు ధోరణి లోనే సాగినట్లనిపిస్తుంది.

'రాగరంజిత'లో—ఆ పేరులోని మాధుర్యం కథలో అంతగా కనిపించలేదు. అమ్మను కోల్పోయి, తన జీవితాన్ని యాంత్రికంగా ఓ కంపెనీ మేనేజరుగా కాలం వెళ్ళబుచ్చిన మధు, కేవలం ఓ వాగ్దానం కోసం పుష్పను వివాహమాడాలనుకోవడం కేవలం హాస్యాస్పదమనిపిస్తుంది. అంతకుముందు అతనికి పుష్పపై గౌరవభావం ఉంది ఉండవచ్చును. ముగింపు మొదటే—అంటే పుష్ప పాత్ర వచ్చినప్పుడే ఊహింపవచ్చు! ఆమెకు కనువిప్పు కలిగినట్టు చూపడం అంత సమంజసంగా ఉన్నట్టు కన్పించ లేదు. కథ, రచన సాధారణ ధోరణిలోనే సాగాయి.

# సింథాల్

## దుర్గంధాన్ని నిర్మూలించి తాజాదనం గల్గించే సబ్బు




చమట వలన గలిగే శరీర దుర్గంధాన్నుండి శక్తివంతంగా కాపాడుతోంది.
ఏ సబ్బు పూర్తిగా వుంచనంత తాజాగా మిమ్ములను వుంచుతుంది.

**సౌందర్య రక్షణకై చర్మ రోగ నిపుణులచే సిఫారసు చేయబడింది.**

**ప్రత్యేక సదుపాయం!**

**సింథాల్ పై 30 పై. తగ్గింపు**

స్టాకు వున్నంతవరకే పరిమితం గాన త్వరపడండి.




'ఆనాడు కలిశాయి కన్నూ కన్నూ
అవి ఈనాడు కలిపాయి నిన్నూ నన్నూ' అని మన చిత్రాల్లో నాయికా నాయకులు పాటలు పాడుతూ పరవశ్యతొక్కి పరవశించే దృశ్యాలు కనిపించినా – మనదేశంలో యువతీ యువకులు తమ జీవిత భాగస్వామిని స్వయంగా ఎన్నుకోవడం అన్నది అరుదుగా జరిగే సంఘటన. పెళ్ళీడు కొచ్చిన ఆడపిల్లను పరుల కంటపడనీకుండా జాగ్రత్తలు తీసుకునే మన సంఘంలో ప్రేమ వివాహాలు తక్కువగా జరగడంలో ఆశ్చర్యమేముంది? 'పెళ్ళంటే నూరేళ్ళపంట' అనుకుంటూ-పెళ్ళి చేసుకునే యువతీయువకుల బంధువులూ, మిత్రులూ, పెళ్ళిళ్ళ పేరయ్యలూ అందరూ కలిసికట్టుగా కలగజేసుకుంటే తప్ప మనదేశంలో పెళ్ళిళ్ళు జరగడం సాధ్యం కాదు. అలా మనదేశంలో 'జంట కుదరడానికి' ఒక యువతీ ఒక యువకుడూ ఉంటే మాత్రం చాలదు. పత్రికలలో వరుడో వధువో కావాలంటూ ప్రచురింపబడే ప్రకటనలు కూడా ఈ విషయాన్ని పదే పదే ఋజువు చేస్తుంటాయి.



అంటే – మనదేశంలో అబ్బాయిలూ అమ్మాయిలూ (యుక్తవయసులో ఉన్నవారే!) కలుసుకోవడానికి మనసులు కలుపుకోవడానికి వీలులేదని కాదు. కాలేజీలలోనూ, కార్యాలయాలలోనూ, అలా కాలేజీకో కార్యాలయానికో వెళ్ళిరావడానికి సాయపడే బస్సులలోనో రైళ్ళలోనో – ఎందరో యువతీయువకులు పరస్పరం తారసపడుతూనే ఉంటారు. అయితే బాగా ఆధునిక వాతావరణంలో పెరిగి, పాశ్చాత్య ధోరణులకు అలవాటుపడ్డ ఏ కొందరో తప్ప తక్కినవారి దృష్టిలో 'ప్రేమ వివాహం' వివాహంగా లెక్కకెక్కదు. 'పెద్దలచే నిశ్చయింపబడి ఆకాశమంత పందిరీ భూదేవంత అరుగూ వేసి ఫలానా కల్యాణమందిరంలో జరిగే పెళ్ళి'కి ఉన్నంత విలువ ప్రేమ పెళ్ళికి లేదని చాలామంది అభిప్రాయం. 'ప్రేమే పాపమౌనా' అని ప్రేమించిన యువతీయువకులు ప్రశ్నిస్తే– పరస్పరాకర్షణ కలిగి ఉండడం, దృక్పథాలు కలవడం, అభిరుచులూ ఆశయాలూ ఒకే తీరులో ఉండడం వంటి కారణాలేవీ జీవిత భాగస్వామి ఎన్నికలో పనికిరావంటారు ఈ పెద్దలు.

అసలు కొన్నివందల సంవత్సరాలుగా ఆడపిల్లలకు చిన్నతనంలోనే పెళ్ళిచెయ్యడం అన్నది మనదేశంలో ఆచారమై కూచుంది. ఈడు మీరిన ఆడపిల్ల పెడదారి పడుతుందన్న భయం ఇందుకు కారణంగా కనిపిస్తుంది. బాల్యవివాహాలు జరపడం చట్టం ప్రకారం శిక్షార్హమని తెలిసి కూడా తమ కుమార్తెలు బాగా చిన్నపిల్లలుగా ఉండగానే పెళ్ళిళ్ళు జరిపించే పెద్దలు ఇప్పటికీ ఉన్నారు.



'ఆమె కన్యగా నిలిచిందంటే
వలచినవాడికి వధువౌతుంది
అందుకే–
ఈడు మీరకుండానే ఆడపిల్లకు
పెళ్ళిచేసెయ్యాలి పెద్దలెప్పుడూ' అని ఒక ఉపనిషత్తులో ఒక ఋషి బోధించాడు.

ప్రాచీనకాలంలో మనదేశంలో స్వయంవరాలూ గాంధర్వ వివాహాలూ జరిగినట్టు పురాణాలూ, చరిత్రా చెబుతూనే ఉన్నాయి. అలా స్వయంవరం ద్వారా గానీ, గాంధర్వ విధానంలో గానీ చేసుకున్న పెళ్ళికి గుర్తింపు కూడా ఉండేది. అయితే ఈ తరహా పెళ్ళిళ్ళకు అంతగా ప్రచారం ఉన్నట్టు కనిపించదు. స్త్రీ పురుషులు ఒకరికొకరు దూరంగా ఉండాలనడం, పెద్దలను గౌరవించాలనడం కలిసి– పరస్పరం ప్రేమించుకోవడానికి యువతీయువకులకు ఎక్కువ అవకాశాలు ఇవ్వలేదు. అనుభవంతో పండిన పెద్దల మాట జవదాటకుండా పెళ్ళాడడం పుత్రికా పుత్రుల ఆదర్శంగా భావించేవారు.



అసలు హిందూ వివాహం కేవలం ఒక స్త్రీకీ ఒక పురుషుడికీ సంబంధించిన ఒప్పందంవంటిది కాదు. మన పెద్దలు వివాహబంధం పవిత్రమైనదనీ అదొక 'సంస్కారం' వంటిదనీ అందుకే పెళ్ళి ఆ దంపతులకు మాత్రమే పరిమితమైనది కాదనీ అభిప్రాయపడ్డారు; వివాహాన్ని వధువు కుటుంబానికీ వరుడి కుటుంబానికీ కూడా సంబంధించిన విషయంగా పరిగణించారు. పాశ్చాత్యదేశాలవారి అభిప్రాయం ప్రకారం స్త్రీ పురుషుల మధ్య పరస్పరాకర్షణ వివాహానికి ప్రధానకారణం కావచ్చునేమో కానీ హిందూ వివాహాలలో మాత్రం పరస్పరాకర్షణ ప్రధానం కాదు.

ప్రాచీనుల దృష్టి ప్రకారం పెళ్ళికి మూడు ఫలితాలు ఉన్నాయి: (1) పెళ్ళాడిన పురుషుడికి కొన్ని మత కర్మలు జరిపే అధికారం లభిస్తుంది. (2) పెళ్ళాడకపోతే పుత్రులు కలగరు. పుత్రులు కలగకపోతే పున్నామనరకంలో పడవలసివస్తుంది. కనుక పెళ్ళాడాలి. (3) పెళ్ళిచేసుకోవడం వల్ల 'కామ పురుషార్థం' సిద్ధిస్తుంది. పరస్పరాకర్షణ వల్ల సిద్ధించే కామపురుషార్థం ఈ మూడు ఫలితాలలో ఒక్కగానొక్కటే కావడంవల్ల ఒక యువకుడూ ఒక యువతీ కేవలం పరస్పరాకర్షణ దృష్ట్యా పెళ్ళాడడం అంత మంచిది కాదని పెద్దలు అభిప్రాయపడ్డారు. అదీకాక అప్పట్లో పెళ్ళిళ్ళు

చాలా చిన్నతనంలోనే జరిపేవారు కనుక యుక్తాయుక్త విచక్షణలేని ఆ వధూవరుల బాగోగులను పెద్దలే నిర్ణయించేవారు.

అలా జంట కుదర్చడంలో తల్లిదండ్రులు, బంధువులు, స్నేహితులు, పెళ్ళిళ్ళ పేరయ్యలు ప్రముఖ పాత్ర వహించసాగారు. ఇద్దరి జీవిత సమస్యను తేల్చడానికి ఇంతమంది ఎలా నిర్ణయాలు చేయ్యగలరు? అలా నిర్ణయాలు చెయ్యడానికి వారు అనుసరించే విధానాలు ఎటువంటివి?

"కన్యా వరయతే రూపం మాతా విత్తం
పితా శ్రుతం
బాంధవాః కులమిచ్ఛన్తి మృష్టాన్నమితరే
జనాః"

అన్న ప్రాచీన సంస్కృత శ్లోకం ప్రకారం పెళ్ళాడనున్న కన్య వరుడి అందచందాల గురించి పట్టించుకుంటుందట; వధువుతల్లి వరుడి సంపాదన గురించీ ఆస్తిపాస్తుల గురించీ ఆలోచిస్తే వధువు తండ్రి వరుడి చదువు సంధ్యల గురించీ పాండిత్యం గురించీ విచారిస్తాడట; బంధువులు వరుడి కుటుంబ గౌరవానికీ అంతస్తుకూ ప్రాముఖ్యమిస్తారట; తక్కినవారు పెళ్ళి విందు గురించి పాకులాడుతారట.



పురాణాలకు వ్యాఖ్యానాలు రాసిన సాంఖ్యాయనుడి అభిప్రాయం ప్రకారం వివాహానికి యోగ్యురాలైన అమ్మాయికి కొన్ని అర్హతలు ఉండాలి: "ఆమె అవయవాలు పొందికగా ఉండాలి; జుట్టు మెత్తగా ఉండాలి. (ఆమె మెడ మీద కుడివైపుకు తిరిగిన రెండు వంపులు ఉండాలి.) అటువంటి యువతి ఆరుగురు కొడుకులను కంటుంది." (కుటుంబ నియంత్రణ గురించి తెలియని ఆ రోజుల్లో ఈ ఆరు సంఖ్యకు పెద్ద ప్రాముఖ్యం లేనేలేదు!)

మరో అభిప్రాయం ప్రకారం "శరభ మృగంలా ఉండే అమ్మాయినీ, కపటంతోనూ క్రౌర్యంతోనూ నిండిన కళ్ళుగల అమ్మాయినీ, గూని యువతినీ, బట్టతలగల అమ్మాయినీ, కప్ప చర్మంవంటి చర్మంగల అమ్మాయినీ పెళ్ళాడకూడదు." అంతేకాదు. ఇంకొక ప్రాచీనాభిప్రాయాన్ని పాటిస్తే "తనవారిని విడనాడుకున్న యువతినీ, ఎక్కువమంది స్నేహితులుగల అమ్మాయినీ, విచ్చలవిడి శృంగారానికి అలవాటుపడిన అమ్మాయినీ, అందమైన చెల్లెలుగల యువతినీ, వరుడితో సమానమైన వయసుగల అమ్మాయినీ పెళ్ళాడకూడదు."

ఆశ్వలాయనుడు తగిన వధువును ఎన్నుకోవడానికి ఒక పరీక్షను పేర్కొన్నాడు. ఆ పరీక్ష చేసేవారు (అంటే వరుడి పక్షం వారు) వధువు ముందు ఎనిమిది రకాల మట్టి ముద్దలు ఉంచేవారు.

ఆ ముద్దలను రకరకాల చోట్లనుండి తీసుకొచ్చేవారు. వీటిలో వధువు ఎన్నుకున్న ముద్దలు తెచ్చిన ప్రదేశాలు మంచివైతేనే ఆమెను అంగీకరించేవారట!

ఆ తర్వాత జాతకాలు సరిపోల్చే పద్ధతి వచ్చింది. ఈ పద్ధతి ప్రకారం సరైన జంట కుదరగలదన్న నమ్మకం కుదిరింది. (అలా ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు కావడం కోసం దొంగ జాతకాలు పుట్టించడం కూడా 65వ కళగా అమలులోకి వచ్చింది!) తగిన వరుడి ఎన్నికకు కులమూ, గోత్రమూ చూసే అలవాటు హెచ్చింది. వధూవరులిద్దరూ ఒక్క గోత్రంవారే అయితే పెళ్ళి చేసుకోరాదన్నారు. అలా చేసుకుంటే బలహీన సంతానం పుడుతుందన్నారు.

వధూవరుల కులమూ గోత్రమూ సరిపోయినంత మాత్రాన పెళ్ళి జరిపేవారుకారు. వారి కుటుంబ గౌరవం, ఆస్తిపాస్తులూ, ఆరోగ్యమూ అన్నిటి గురించీ ఆరాలుతీసి కట్నం గురించీ కానుకల గురించీ ముందుగానే మాట్లాడుకుని సరైన బేరం కుదిరితేనే, పెళ్ళి జరిపేవారు.

వధూవరులు పరస్పరం అపరిచితులైన సందర్భంలో ఇటువంటి అంశాలను పట్టించుకోక తప్పిందికాదు. అయితే ఇవాళ్టి పరిస్థితులలో ఈ విధానాలు అనుసరించడం అసాధ్యమేకాదు. అనవసరం కూడా. ఇప్పటి పరిస్థితులలో వధూవరుల వ్యక్తిత్వాల గురించీ వారి కుటుంబాల గురించీ, వ్యక్తిగత ఇష్టానిష్టాల గురించీ పట్టించుకుంటే చాలు.

కాబోయే భార్యాభర్తలు ముందుగానే ఒకరినొకరు బాగా అర్థం చేసుకుంటే అంతకన్నా కావలసిందేదీ ఉండదు. పరస్పరాకర్షణ అన్నది కేవలం శారీరకమే అయితే ఆ దంపతులు ఎక్కువకాలం కలిసి కాపురం చెయ్యలేరు. అలాగే వధూవరుల మతాలూ, భాషలూ, వారు పెరిగిన వాతావరణాలూ, ఆచారవ్యవహారాలూ, ఆహార విధానాలూ, సాంఘికస్థాయి వంటి వాటిలో భేదం ఉన్నా ఆ ఆలుమగలు కలిసి మెలిసి కాపురం చెయ్యడం కాస్త కష్టమే అవుతుంది. పెద్దలు కుదిర్చే పెళ్ళిలో ఈ సమస్యలు చాలావరకు ఉండవు. అలా భార్యాభర్తల మధ్య భేదాభిప్రాయాలు రావడానికి అంతగా ఆస్కారం ఉండదు. పెళ్ళాడేముందు శరీరాల తత్వాల రీత్యా కూడా వధూవరులు సరిపోతారా అన్న విషయం గుర్తించాలి.



'ముందూ వెనకా తెలియని ఇద్దరు — భార్యాభర్తలుగా కలకాలం కాపురం చెయ్యడం దుస్సాహసంకాదా' అని విదేశీయులు మన పెద్దలు కుదిర్చే పెళ్ళిళ్ళ గురించి అభిప్రాయపడుతూ ఉంటారు. 'ప్రేమించి పెళ్ళి చేసుకోవాలా? పెళ్ళాడాక ప్రేమించడం ప్రారంభించాలా?' అన్నవే ఇవాళ్టి భారతీయ యువతీయువకులను ఎదుర్కొనే ప్రశ్నలు.

ప్రేమించుకున్న యువతీయువకుల పెళ్ళిలో కాస్త 'కుదర్చడమూ,' పెద్దలు కుదిర్చే పెళ్ళి చేసుకోబోతున్న యువతీయువకుల మధ్య కాస్త 'ప్రేమా' ఉంటే బాగుంటుంది. అయితే ఈ ప్రేమ ముదిరి పెళ్ళి కుదరడానికీ, కుదిరిన పెళ్ళి ముందు ప్రేమ కుదరడానికీ ఆయా యువతీ యువకులకు సానుభూతితో తోడ్పడి వారి జీవితాలను చక్కగా తీర్చి దిద్దగల భారాన్ని తల్లిదండ్రులూ, బంధుమిత్రులూ స్వీకరించాలి! అదే పెళ్ళికి సఫలత!

—పుష్పాసుందర్

# దీపావళికి మూడు సంస్థల కంచి పట్టుచీరలు

శివా డిజైనులో కమల్ రంగులో $5\frac{1}{2}$ మీటర్ల ఈ కాంచీపురం పట్టుచీరె రూ. 659 నుండి రూ. 956 మధ్య ధరలలో లభిస్తుంది. మద్రాసులోని పి. బి. లక్ష్మణసావారు దీపావళి కోసం రూపొందించిన కొత్త చీరె ఇది.



ప్రకాష్ రంగులో, సెల్వి డిజైనులో రెండువైపులా అంచులు, కొంగులు గల ఈ కాంచీపురం పట్టు చీరను రెండు వైపులా కట్టవచ్చు. ఈ చీరను మద్రాసు వాణీసిల్క్సువారు దీపావళికి ప్రత్యేకంగా తయారుచేశారు. (ఈ చీరె ఖరీదు రూ. 390 నుంచి రూ. 1400 దాకా)

'అనిత' అన్ని రంగులలోనూ ఒక వైపు బార్డర్‌తో గానీ రెండు వైపుల బార్డర్‌తో గానీ లభించే 6 గజాల కాంచీపురం పట్టుచీర. రూ. 500 నుంచి రూ. 850 దాకా వెలగల ఈ చీరెను మద్రాసు రాణిసిల్క్ పారడైజ్‌వారు రూపొందించారు.



# వివిధ ప్రాంతాలలో
# దీపావళి
# ఎలా జరుపుతారు?











దీపావళి పండుగ - దేశమంతా జరుపుకునే పండుగ. దీపావళి రోజున భారతదేశం యావత్తూ రంగు రంగుల మతాబాలతో దీప కాంతులతో ప్రకాశిస్తుంది. అయితే, దీపావళి పండుగను అందరూ జరుపుకున్నా ప్రాంతీయంగా విధానాల్లో కొంత తేడా వుంటుంది. ఈ శీర్షికలో వివిధ ప్రాంతాలలో నివసించేవారు-దీపావళిని తాము ఎలా జరుపుకుంటారో - తెలియజేస్తున్నారు:

[35 వ పేజీ చూడండి]



తమిళనాడులో....

"తమిళనాడులో మేము చేసుకునే పండగల్లో దీపావళికి, పొంగల్‌కి (సంక్రాంతికి) ఎంతో ప్రాముఖ్యం ఉంది.

దీపావళికి కొత్త బట్టలు ధరించడం, టపాకాయలు కాల్చడం—తమిళనాడు అంతటా కనిపించే దృశ్యం.

నరకచతుర్దశినాడు సూర్యోదయానికి ముందే తలంటుపోసుకోవడం తమిళ సంప్రదాయం. దీపావళి తెల్లవారుజామున నీటిలో గంగ, నూనెలో లక్ష్మి కొలువై ఉంటారని తమిళుల విశ్వాసం. తలంటుపోసుకోవడానికి ఉపయోగించే నూనెలో తమలపాకు, పసుపు, వాము, మిరియాలు వేసి కాచి, నూనె నులివెచ్చగా ఉండగా తీసి తలంటుకుంటాము. వేన్నీళ్ళు ఉపయోగించి తలంటుపోసుకుని ఆ తర్వాత ఇంట్లో ఉన్న దేవుడి బొమ్మ ముందు కొత్త బట్టలు, టపాకాయలు, నగలు (ఏవైనా చేయించుకుని ఉంటే) ఉంచి ఇంటి పెద్ద నివేదన చేస్తాడు.

అప్పుడు దేవుడికి కర్పూరహారతి చేసి కొబ్బరికాయ కొట్టి పూజ చేసి దీపావళి పండగ ప్రారంభిస్తాము.

నుదుట తిలకం దిద్దుకుని, ఆ తర్వాత కొత్త బట్టలు కట్టుకుని, దీపావళి కోసం ప్రత్యేకంగా తయారు చేసిన లేహ్యాన్ని (పసుపు, వాము, సొంటి, లవంగం, జాజికాయ, మాచికాయ, మిరియాలు, జాపత్రి, పిప్పళ్ళు దాల్చినచెక్క, అతిమధురం, దనియాలు వంటి వాటినన్నిటినీ కలిపి ఈ లేహ్యం తయారు చేస్తారు) మూడుసార్లు – గచ్చకాయ అంత పరిమాణంలో ఉండే ఉండలుగా తీసుకుని తింటారు.

దీపావళి లేహ్యం తిన్నాక – పెద్దలకు నమస్కరించి ఆశీస్సులు పొందడం, బంధువుల యిళ్ళకూ మిత్రుల యిళ్ళకూ వెళ్ళి అభినందనలు తెలిపి—వారికి దీపావళి తినుబండారాలు ఇచ్చి రావడం తమిళుల ఆచారం. అలా వెళ్ళినప్పుడు 'గంగాస్నానం ఆచ్చా?' (గంగాస్నానం అయిందా) అని అడుగుతారు.

కొత్తగా పెళ్ళైనవారికి 'తొలి దీపావళి' పేరిట కట్నాలూ, కానుకలూ ఇస్తుంటారు.

అమావాస్యనాడు వృద్ధులైన స్త్రీ పురుషులు కావేరీ నదిలో స్నానం చేసి అలా 'తులా స్నానం' చేశామన్న సంతృప్తి పొందుతారు. ఇది తిరుచ్చి, సేలం, తంజావూరు జిల్లాలలో ప్రాచుర్యంలో ఉన్న అలవాటు."

—శ్రీమతి సరోజా స్వామినాథన్

కర్ణాటక ప్రాంతంలో....

"మా కన్నడిగులం దీపావళి పండుగను మూడు రోజులు జరుపుకుంటాము. మొదటి రోజు నరకచతుర్దశి. ఆ రోజు తెల్లవారుజామునే లేచి ఇంటిల్లిపాదీ తలంటుపోసుకుని, పూజచేసుకుని, మృష్టాన్నభోజనం చేస్తాము. ఆ తర్వాతి రోజు అమావాస్య. అమావాస్యకు అంతగా ప్రాముఖ్యం లేదు. ఆ మర్నాడు బలి పాడ్యమి. ఆనాడు – తాను ముందెప్పుడో చేసిన వాగ్దానం ప్రకారం బలిచక్రవర్తి పాతాళం నుంచి భూమి మీదికి వచ్చి భూలోక ప్రజలు ఎలా ఉన్నారో చూస్తాడని మా విశ్వాసం. ప్రజలు సంపదతో తులతూగుతూ ఉంటే బలి సంతోషించి వెళ్ళిపోతాడట.

పంటలు బాగా పండితే అంతకన్నా సమృద్ధి ఏముంటుంది? అందుకు చిహ్నంగా బలి పాడ్యమి రోజున ఒక పీట మీద గోమయంతో బలికోట అమర్చి, ఆ పేడ గోడల మీద వరి, రాగి, జొన్న వంటి పంటల మొలకలను, నువ్వు పువ్వులు (ఈ రకం నువ్వులను కన్నడంలో హుచ్చెళ్ళు అంటాము) అమరుస్తాము. బలి ఆ కోటకు వచ్చి ఈ మొలకలను, పువ్వులను చూసి భూలోక ప్రజలు సంపదతో తులతూగుతున్నారన్న ఆనందంతో తిరిగి వెడతాడని అంటుంటారు.

ఈ బలికోటకు అందరమూ మొక్కి నైవేద్యాలూ అవీ పెట్టి పూజిస్తాము. ఆరోజే కొత్త బట్టలు ధరిస్తాము.

చతుర్దశి నుంచి పాడ్యమి దాకా మూడు రోజులూ ఇళ్ళూవాకిళ్ళూ పూర్తిగా ప్రమిదెలతో అలంకరించి ఉంచుతాము.

కర్ణాటకరాష్ట్రం లోని వివిధ ప్రాంతాలలో దీపావళిని ఆచరించే విధానాలలో ఇక్కడ వివరించిన పద్ధతికన్నా భిన్నమైన ధోరణులు కూడా వుండొచ్చు."

—ఇందుమతీ నంజుండప్ప

కేరళలో....

"నరకాసురుడు మరణించడం వల్ల ప్రపంచానికి విముక్తి లభించిన శుభ సమయాన్ని ఇంటింటినీ దీపాలతో అలంకరించి గుర్తు చేసుకోవడం భారత దేశమంతటా ఉన్నట్టే కేరళలోనూ అలవాటే.

దీపావళి రోజున కేరళలోని చిన్నా పెద్దా అందరమూ మాకు దగ్గర్లో ఉన్న చెరువులోనో నదిలోనో బ్రహ్మ ముహూర్తం వేళ (తెల్లవారు జామున) స్నానం చేసి పరిశుభ్రంగా తయారై దేవుడి ముందు కూచుని ప్రార్థన చేస్తాము. ప్రపంచాన్ని పట్టి పీడించిన నరకుడి బెడద వదిలించినందుకు కృతజ్ఞత చెబుతున్నట్లు ఉంటుంది అప్పటి ప్రార్థన.

ఆ తర్వాత తన ఆర్థిక స్థితితో నిమిత్తం లేకుండా ప్రతి కేరళీయుడూ ఆరోజు ఉదయం—తన కుటుంబ సభ్యులతోను బంధు మిత్రులతోనూ కూచుని ఫలహారం చేస్తాడు.

ఫలహారం చెయ్యడం ముగిశాక పెద్దలూ పిల్లలు అన్న భేదం లేక అందరమూ ఏదో ఒక కాలక్షేపంలో పడతాము. ఆటలూ పాటలూ ఉత్సాహంగా సాగుతాయి. ఎండను కూడా లెక్కచెయ్యక హాయిగా ఆరుబయట ఆటలలోను పాటలలోనూ నిమగ్నులమై అలా మధ్యాహ్నం దాకా గడుపుతాము. ఆ తర్వాత మంచి విందు భోజనం కడుపునిండా తిని మళ్ళీ సాయంకాలం దాకా ఆట పాటలలో పాల్గొంటాము. అలా సంజెవేళదాకా గానీ

చీకటి పడేదాకా గానీ ఆట పాటల సంబరం అలా సాగిపోతుంటుంది.

దీపావళి రోజున కేరళ గ్రామ ప్రజలు తమ ఊళ్ళోని దేవాలయాలకు వెళ్ళి అక్కడ దీపారాధన జరిగేటప్పుడు దైవ దర్శనం చేసుకుని ఆ తర్వాత భజనలు చెయ్యడం, హరికథలు వినడం వంటివి చేస్తారు.''

—రుక్మిణీదేవి భాస్కరన్

ఒరిస్సాలో....

"ప్రతి సంవత్సరం మా ఇల్లు ఇలాగే కళా కాంతులతో కళకళలాడుతూ ఉండాలి' అన్న భావం స్ఫురించేలా ఒరిస్సాలో హిందువుల గృహాలు—దీపావళి రోజున, చక్కగా దీపాలతో మెరిసిపోతూ వుంటాయి. సామాన్య కుటుంబీకులు సైతం – తమ స్తోమతకు అనుగుణంగా ఇంటిని దీపాలతో అందంగా అలంకరిస్తారు.

ఇక్కడ నరకచతుర్దశికి అంతగా ప్రాధాన్యం ఉండదు. దీపావళి రోజున కూడా సాయంత్రమే ప్రధాన పూజా కార్యక్రమం ఆరంభిస్తాము.

కుటుంబసభ్యులందరూ శుచిగా స్నానాలు చేసి, కొత్త బట్టలు కట్టుకుని లక్ష్మీదేవికి పూజలు చేస్తారు. పూజానంతరం, 'కౌరియా కాఠి'ని (ఆంధ్రదేశంలో 'దిబ్బుదిబ్బు దీపావళి' అని ఆముదపు చెట్టు కొమ్మలపై వత్తులు వెలిగించినట్లుగా) వెలిగిస్తారు. 'మా ఇంట్లో చీకట్లను పారద్రోలండి. మీరే దీపాలై మా ఇంటికి వెలుగునీయండి' అని దేవుళ్ళను ప్రార్థిస్తారు. ఆ తర్వాత ఉత్సాహంగా పిల్లలు, పెద్దలు బాణాసంచా కాల్చడం ప్రారంభిస్తారు.

ఈ పండుగకు ప్రత్యేకంగా కొన్ని పిండివంటలు తయారుచేయడం ఇక్కడి వనితల అలవాటు. వీటిలో అరిసా పీఠా, మొండా పీఠా, గయింతా, కక్కరా అన్నవి ముఖ్యంగా వుంటాయి. 'ఖీరీ' (పాయసం) కూడా తప్పని సరిగా వుంటుంది.

దీపావళి మరుసటి రోజున ఈ ప్రాంతంలో 'జమ దీపావళి' జరుపుకుంటారు. (ఉత్తర భారత దేశంలో ధన త్రయోదశినాడు అపమృత్యు నివారణార్థం దీపాలు పెట్టి, యమదీపం అని వ్యవహరించడానికి, ఒరిస్సాలో ఈ జమదీపం చేయడానికీ కారణాలు ఒకటై వుండవచ్చునేమో!) ఈ రోజున మాత్రం రెండే రెండు దీపాలు—ఒకటి ఇంటి ముందు, మరొకటి ఇంటి వెనుకా వెలిగిస్తారు.

క్రితం రోజు కాల్చగా మిగిలిన బాణాసంచాను ఆ రోజు కాల్చి వేయడం తప్ప—'జమ దీపావళి'కి ప్రత్యేకంగా ఇంకేమీ చేయరు.''

—శ్రీమతి ఆశాలతా బెహెరా

వంగరాష్ట్రంలో....

"మాకు నవరాత్రి విశేషం ఎక్కువ. నవరాత్రి పూజలు కాగానే దీపావళి వస్తుంది. అంటే—నవరాత్రి పూర్తి కావడం, దీపావళి రావడం జరుగుతుందన్నమాట. దీపావళి రోజున ప్రమిదలలో వత్తులు వేసి—ఎక్కువగా దీపాలు వెలిగించడం—మా ఆచారం.

దసరా రోజుల్లో ప్రతి ప్రాంతం లోనూ, పార్కుల్లోనూ కాళీదేవి విగ్రహాలను పెట్టి పూజలు జరుపుతారు. కాళీ—దుర్గామాత అవతారం. దుర్గామాత అంటే—శక్తి. ఈ 'శక్తి' చెడును నిర్మూలించి, మంచిని రక్షిస్తుంది. అమావాస్యనాడు రాత్రి దుర్గమాతకు పూజలు జరుగుతాయి. పూజలు కాగానే, బాణాసంచా కాలుస్తారు. వీధులన్నీ దీపాలతో అలంకరిస్తారు; ఇళ్ళు కూడా తోరణాలతోనూ దీప తోరణాలతోనూ, అత్యంత ఆహ్లాదకరంగా ఉంటాయి. ఉత్సవాలు కూడా జరుగుతాయి. ఆ ఉత్సవాల్లో నాటకాలు, సంగీతం మొదలైనవన్నీ చోటు చేసుకుని, ప్రజలను వినోదపరుస్తాయి. అమావాస్య మరునాడు, ఆయా విగ్రహాలను దగ్గరలో ఉండే నదుల్లో నిమజ్జనం చేస్తారు.

ఉత్తర భారత దేశంలోని కొన్ని ప్రాంతాలవారు "దీవాలి"ని జరుపుతున్నట్టే – మేమూ జరుపుకుంటాము. "స్వీట్స్" పంపకాలు, బంధువులు రావడాలు, కొత్త బట్టలూ—అవన్నీ ఉంటాయి.''

—శ్రీమతి గంగూలి

గుజరాత్‌లో....

"గుజరాతీయులం 'దీపావళి'ని అద్భుతంగా జరుపుతాము. మాలో ఎక్కువమంది వ్యాపారస్థులు. అందువల్ల మాకు ఇది చాలా ముఖ్యమైన పండగయింది. దీపావళితో కొత్త సంవత్సరం ఆరంభమవుతుంది. పాత అకౌంట్ పుస్తకాలను మూసేసి, కొత్త పుస్తకాలు తెరుస్తారు. లక్ష్మీదేవికి పూజలు చేస్తాము. ఆ పూజలతోపాటే, కొత్త పుస్తకాలకు కూడా పసుపు కుంకుమలు పెట్టి పూజలు జరుపుతాము. ఈ విధానం ఎంతకాలంగానో వస్తున్నందువల్ల, గుజరాతీయులు కానివారు కూడా, ఈ విధానాన్ని అనుసరిస్తున్నారు.

మాకు దీపావళితో 'హిందూ సంవత్సరం' అంతమవుతుంది. కొత్త సంవత్సరం ఆరంభమవుతుంది. అంచేత, ఆ రోజు పెద్దపెద్ద ముగ్గులూ అవీ వేసి, కోలాహలంగా పండగ జరుపుతాము. ఇళ్ళు, వాకిళ్ళూ అలంకరిస్తాము. పెద్దలకూ, పిల్లలకూ కూడా 'దీపావళి' ఆనందకరమైన పండుగ. ప్రత్యేకంగా రకరకాల 'స్వీట్స్' చేసుకోవడం కూడా ఆనవాయితీ. ఆ రోజు స్నేహితులు ఇంటికివస్తారు. వచ్చేటప్పుడు వాళ్ళు 'స్వీట్స్' తీసుకొచ్చి, అభినందనలు అందజేస్తారు. ఇంటికి వచ్చినవారికి మేము కూడా 'స్వీట్స్' ఇచ్చి మా అభినందనలు తెలుపుతాము. పిల్లలకు కొత్త దుస్తులు కుట్టిస్తాము. బంధువులందరూ, పిల్లలకు కానుకలు పంపిస్తారు. ఆ కానుకల్లో బట్టలు, డబ్బు, దీపావళి బాణాసంచా, స్వీట్స్ వంటివి ఎన్నో వుంటాయి.

అకౌంట్ పుస్తకాలకు పూజ జరిపే ఈ రోజున, ఇంట్లోని ఆడ వాళ్ళం కూడా—ఫ్యాక్టరీలకో, ఆఫీసులకో—ఇంటి యజమాని ఏది నడిపితే ఆ స్థలానికెళ్తాము. అలా ఫ్యాక్టరీలకుగానీ, ఆఫీసులకు గానీ స్త్రీలు వెళ్ళేది—

ఈ రోజునే. ఫ్యాక్టరీలలో, తక్కిన వ్యాపార సంస్థలలో పనిచేసే వారంద రికీ, ఈ రోజున 'బోనస్'లు ఇవ్వడం కూడా రివాజు.

పండగకు కూతుళ్ళనూ, అల్లుళ్ళనూ పిలవడం, వాళ్ళకు కొత్త బట్టలు పెట్టడం–కూడా మా ఆచారం.

లక్ష్మీపూజ చేసేటప్పుడు విధిగా వెండి నగలు కొనాలన్న నియమం ఉన్నది. లేదా–లక్ష్మిబొమ్మగల చిన్న వెండినాణెం అయినా కొనాలి. దాన్ని పాలు పసుపు కలిపిన నీళ్ళలో స్నానం చేయించి, పూజలో పెడతాము. రాత్రుళ్ళు దీపాలు పెట్టి, బాణసంచా కాలుస్తాము.''

సుభద్రా కుమారి

మహారాష్ట్రలో...

''మాకు దీపావళి నాలుగురోజులు – నరక చతుర్దశితో ఆరంభమై, దీపావళి వెళ్ళిన రెండు రోజులవరకూ పర్వదినాలే. తొలి రోజును నరక చతుర్దశి, రెండో రోజును దీపావళి అమావాస్య, మూడో రోజును 'పార్వ' నాలుగోరోజును 'భవ్‌బీస్' అంటాము. ఈ నాలుగు రోజులూ ప్రతి ఉదయమూ అభ్యంగ స్నానాలూ, పూజలూ వుంటాయి. దీపావళి రోజున లక్ష్మి పూజ చేస్తాము. కొత్త బట్టలు కట్టుకుంటాము. బంధువులు స్నేహితులు రావడం; మేము వాళ్ళ ఇళ్ళకు వెళ్ళడం – 'స్వీట్స్' పంపకాలూ–ఇవన్నీ ఉంటాయి.

నరక చతుర్దశి నుంచే–ఇళ్ళముందు దీపాలు పెట్టడం ఆరంభిస్తాము. ఈ దీపాలు వెలిగించడం నాలుగు రోజులూ ఉంటుంది. ప్రమిదల్లో వత్తులు, మంచినూనె వేసి-దీపాలు వెలిగిస్తాము. దీపాలన్నీ 'పంక్తి'లో ఉంచుతాము కాబట్టి-ప్రమిదను మేము 'పంక్తి' అంటాము. ఈ నాలుగురోజులూ, పటాసులు మతాబాలు కాల్చడం ఉంటుంది.

చాలామంది ఇళ్ళల్లో–అంటే ముందు హాల్లో ''ఖిల్లా'' అని పెడతారు. అంటే, అట్టలతోనో, కాగితంతోనో గోపురంలాంటిది కట్టి–పైన దీపం పెడతాము. దాన్ని ''ఆకాశ కందిల్'' అంటాము. ఆ దీపం–లైట్‌హౌస్ దీపంలా–చుట్టూ తిరిగేట్టుగా కొందరు ఏర్పాటు చేస్తారు. ఈ దీపానికి పూజలు చేస్తాము. ఈ 'ఆకాశ కందిల్' అనేది కూడా నాలుగు రోజులూ వుంటుంది.

దీపావళి వెళ్ళిన మర్నాడు ''పార్వా.'' ఈ రోజున భార్య – భర్త పాదాలు కడిగి, హారతి ఇవ్వడం వంటివన్నీ ఉంటాయి. ఇది భార్యాభర్తల అన్యోన్యత కోసం. "భవ్‌బీస్" అనే నాలుగో రోజు–'అన్నా చెల్లెళ్ళ రోజు.' చెల్లెళ్ళు అక్కలూ సోదరులను ఆహ్వానించి, హారతులిచ్చి, గౌరవిస్తారు. సోదరులు–వారికి కొత్తబట్టలూ, కానుకలూ, స్వీట్స్ ఇచ్చి, ఆశీర్వదిస్తారు. అందరూ కలిసి వినోద ప్రదర్శనలకు వెళ్ళడమో–ఇంట్లోనే కూర్చుని వినోదంగా కబుర్లు చెప్పుకోడమో చేస్తారు.''

—శ్రీమతి బాలచంద్ర్ ఆప్టే

పంజాబులో....

''పంజాబులో మేము దీపావళిని నరక చతుర్దశినాడు చేసుకుంటాము. ఆ రోజు ఇళ్ళనూ, అంగళ్ళనూ శుభ్రంగా కడిగి–సాయంకాలం లక్ష్మీదేవి ముందు (లేదా ఇంట్లో వున్న దేవుడి బొమ్మ ముందు) విలువగల నగలూ, వస్తువులూ, గుడ్డలూ అవీ ఉంచి పూజ చేస్తాము. అక్కడ ఒక దీపం వెలిగించి పెడతాము. ఇంటిని పూర్తిగా దీపాలతో అలంకరిస్తాము. ఇంట్లో ఏ ఒక్క దీపమైనా రాత్రంతా అలా వెలుగుతూ ఉండనిస్తాము. ఆ దీపం అలా వెలుగుతూ ఉంటే అర్ధరాత్రి సమయాన ఎప్పుడో వచ్చే లక్ష్మీదేవి ఆ దీపం సాయంతో ఇంట్లోకి వస్తుందని మా నమ్మకం.

రాముడు రావణుణ్ణి చంపి విజయవంతంగా తిరిగి వచ్చిన సందర్భానికి గుర్తుగా మేము దీపావళి పండగ జరుపుకుంటాము.

దీపావళి రాత్రి టపాకాయలు కాలుస్తాము. ఆ రోజు రాత్రి ప్రతి వారూ జూదమాడాలన్న నియమం ఉంది. ఈ అవకాశాన్ని ఉపయోగించు కొని కొందరు దీపావళికి ముందుగా రెండు రోజుల నుంచే జూదమాడడం ప్రారంభిస్తారు. ఆ వ్యసనం లేనివారు ఏ బాదంపప్పులనో తీసుకుని గుప్పిట్లో పెట్టుకొని అవతలి వారిని 'సరా? బేసా?' చెప్పమంటారు. అవతలి వారు సరైన సమాధానం చెబితే వారికా బాదంపప్పులు ఇస్తారు. లేకుంటే అవతలివారే అన్ని పప్పులూ ఇవ్వాలి. దీపావళి పూజ కాగానే పరిచితుల యిళ్ళకు వెళ్ళి అక్కడ జూదమాడుతూ కూచుంటారు. వారిని ''ముందు రోజు 'దీవాలీ' ఇవాళ 'దివాలా''' అని అమావాస్య రోజున పరిహాసం చేస్తూ ఉంటాము.

దీపావళికి కొత్త బట్టలు ధరించాలన్న నియమం మాలోలేదు. ఆర్థికస్థితినిబట్టి పిల్లలకు మాత్రం కొత్త గుడ్డలు కొనడం జరుగుతుంది. ప్రతివారూ ఆ రోజున ఇంటికి పనికివచ్చే వస్తువు ఏదన్నా కొంటారు. ఈ కొనడం కూడా వారివారి ఆర్థికపరిస్థితుల మీద ఆధారపడి ఉంటుంది.

వ్యాపారస్థులు ఆ రోజు కొత్త లెక్కలు ప్రారంభిస్తారు. దీపావళి పండగ–చతుర్దశినాటి రాత్రే పూర్తవుతుంది. దీపావళి అమావాస్య తర్వాత వచ్చే ద్వితీయ నాడు 'బయ్యాదూజ్' అన్న పండగ చేసుకుంటాము. ఆ రోజు సోదరులుగల ప్రతి పంజాబీ వనిత తన సోదరులకు వీర తిలకం దిద్దుతుంది.''

—శ్రీమతి రూప్‌రాజ్

క్రొత్తది!

# అమృతాంజన్ లిమిటెడ్‌వారి విశిష్ఠమైన

# ఆముదము

## శుద్ధిచేసినది.
## వాసనలేనిది.

అమృతాంజన్ ఆముదము
సుప్రసిద్ధ అమృతాంజన్ కంపెనీ వారి
మరో విశిష్ఠమైన ఉత్పత్తి.

అమృతాంజన్ ఆముదము






మూడు
సైజులలో
లభిస్తుంది:
50 మిలి
100 మిలి
200 మిలి

OBM 3270/2R TG

# చీర తెచ్చిన మార్పు



"ఏమండీ! మిమ్మల్నే. నా మాట కాస్త వినిపించుకుంటారా" చదువుతున్న పేపర్ లాక్కుంటూ అడిగింది భర్తను సునీత.

"ప్రొద్దున్నే మొదలెట్టావ్! చెప్పేదేదో త్వరగా చెప్పు. పేపర్ చూసుకోవాలి." అన్నాడు కాస్త చిరాగ్గా సుందర్.

"నేనన్నా, నా మాటలన్నా మీకు చిరాగ్గానే ఉంటుంది. ఏదో సరదాపడి పండక్కి పట్టుచీర కొంటారేమో అని అడుగుదామనుకుంటే, ఆదిలోనే హంసపాదు అన్నట్లు మూతి ముడుస్తున్నారుగా. దేనికయినా అదృష్టం ఉండాలి. పెళ్ళి చేసుకోగానే సరా, సరదాలు తీరనప్పుడు, ఏమనుకుని ఏం లాభం...."విసురుగా లేచి రాబోయింది సునీత.

"సీతా! డియర్. కాస్త ఆగండి." అంటూ చేయిపట్టి మరీలాగాడు సుందర్.

"ఉఁ!" అంటూ కుర్చీలో కూర్చుంది ప్రక్కనే సునీత.

"ఈసారి ఫెస్టివల్ అడ్వాన్సు రానీ. తప్పకుండా నువ్వడిగిన పట్టుచీర కొనిస్తాను. దానికింత కోపమయితే ఎలా? నేనేమన్నా కొనివ్వనన్నానా. ఈ వారంలో అడ్వాన్సు రావచ్చు. అయినా పండగ యింకా చాలా రోజులుందిగదా! అన్నట్లు నిన్న మీ ఫ్రెండ్ వచ్చినట్లుంది. విశేషాలేమిటి?" టాపిక్ మార్చాలని అడిగాడు సుందర్.

"ఆఁ! వచ్చింది లెండి. తనే మహా 200 రూపాయలు పెట్టి చీరకొన్నానని చూపించాలని మరీ వచ్చింది. ఉన్న 10 నిమిషాలూ ఆ చీర గురించి,

టి. లక్ష్మి

## వినతి

'వనిత 'కు ప్రచురణ కోసమని కథలు, వ్యాసాలూ గేయాలూ మొదలైనవి పంపేవారు కొన్ని విషయాలను గుర్తుంచుకోవలసిందిగా కోరుతున్నాము. కథలు, వ్యాసాలూ సాధ్యమైనంత క్లుప్తంగా వుండాలి. పేజీకి ఒక్కవైపునే సిరాతో శుభ్రంగా, తెలిసేలా— రాయాలి. ప్రతి రచనపైనా, వారి పేరు, పూర్తి చిరునామా వుండాలి. అది ఏ రచన అయినాసరే, అది తమ సొంతం అని, దేనికీ అనుసరణ, మక్కీ కాదని, దీంతోపాటే ఇంకొక పత్రికకు కూడా పంపలేదనీ—హామీ పత్రం రాసి ఇవ్వాలి. ప్రతి రచనతోపాటు, తమ చిరునామా రాసివున్న కవరును స్టాంపులతో సహా జతచేసి, పంపితేగాని, సమాధానం ఇవ్వడానికిగాని, రచన తిప్పిపంపడానికిగాని వీలుండదు. రచనల పరిశీలనకు కనీసం మూడు మాసాలైనా వ్యవధి కావలసివుంటుంది. ఈలోగా, 'రచన ఏమైంది?' అని ఉత్తరాలు రాయడంవల్ల ప్రయోజనం వుండదు. (రచన ప్రచురింపబడే పక్షంలో, ముందుగానే రచయిత్రులకు తెలియజేయబడుతుంది) ఈ చిన్న విషయాలను గుర్తుంచుకుని, మాతో సహకరించవలసిందిగా రచయిత్రులను కోరుతున్నాము.

—వ. సం

వాళ్ళ ఆయన గురించి ఒకటే గొప్పలు....చెవులు చిల్లులుపడేలా. నేను మాత్రం తక్కువ తిన్నానా ఏం? మా ఆయన కూడా ఈసారి పండక్కి పట్టు చీర తెస్తానని చెప్పారని చిన్న అబద్ధం ఆడేశాను. దానికోసమయినా మీరు చీరకొనక తప్పదు. నేనా పట్టుచీర కట్టుకుంటే గాని దాని పొగరణగదు. 'పండగ పర్చేజింగ్స్ అయినాయా' అంటూ సాగదీస్తూ అడిగింది. పెద్ద తను ముందుకొన్నదని, ఎవరూ కొనలేరని కాబోలు. ఏమండీ చీర కొంటారు గదా – పాపకు, బాబుకు రెడిమేడ్‌వి తీసేస్తే సరి. దీపావళికి మంచివే తీశాము కదా! ఏమంటారు?" అంటూ అడుగుతున్న సునీత కేసి అదోరకంగా చూస్తూ – "అలాగేలే! అడ్వాన్సు రానీ. అయినా పట్టు చీర ఉంటేగాని పండగ వెళ్ళదా ఏం." అన్నాడు సుందర్.

"పండగ వెళ్ళినా, నేను బయటికి వెళ్ళలేను.... అంతే! అయినా పెళ్ళయిన తర్వాత 100 రూపాయలు పెట్టి చీరకొన్నారా! పెద్ద మాట్లాడతారు."

"300 రూపాయల జీతగాణ్ని పెళ్ళి చేసుకుని 100 రూపాయల చీరపై ఆశలు పెట్టుకోవటం ఆకాశానికి నిచ్చెన వేసినట్లే అవుతుంది. పోనీలే. సరదాపడుతున్నావుగా, చూద్దాం"

"నేను చదువుతానంటే చదివించక స్కూలు ఫైనలు కాగానే మూడు ముళ్ళు వేయించారు. లేకపోతే నేనూ డిగ్రీ సంపాదించుకుని నాకాళ్ళపై నేను నిలబడగలిగేదాన్ని. మీరన్నట్లు గొంతెమ్మ కోరికలు కోరటం నాదే పొరపాటు" కోపంగా లేచి వెళ్ళిపోయింది సునీత.

వెళుతున్న సునీత కేసి చూసి నిట్టూరుస్తూ "నేను మాత్రం ఏమి చేసేది? నాకూ ఎంతో కొనాలనీ చేయాలనీ ఉంది. పెద్ద కొడుకుగా పుట్టడం వల్ల బాధ్యత పైబడటం వల్ల తమ్ముళ్ళ చదువులకీ, చెల్లెళ్ళ పెళ్ళికీ డబ్బు చూసి చూసి వాడవలసి వస్తోంది. సునీత అన్నది నిజమే. పెళ్ళయ్యాక ఒక్క చీర ఖరీదయినది కొనలేదు. పాపం! ఆశపడుతోంది....కొంటేసరి. ఆ మోజూ తీరుతుంది. నామాటా దక్కుతుంది." అనుకుంటూ పేపర్ తిరగేయసాగాడు సుందర్.

*

"సునీతా!" అంటూ వచ్చింది సుజాత చేతిలో పాకెట్‌తో.

"బహుకాల దర్శనం! దారి తప్పావా" అంటూ పలకరించింది సునీత.

"ఈమధ్య ఊళ్ళో లేనుగా! నిన్ననే వచ్చాను. పండగ బట్టలవి తీసేశావా" అడిగింది సుజాత కూర్చుంటూ.

"ఆఁ! తీసినట్లే ఉంది. ఏదో పాకెట్ తెచ్చావు. ఏం చీర కొన్నావేం!" అంటూ పాకెట్ విప్పింది సునీత.

"ఏదోలే! 30 రూపాయలని కాటన్ సారీ తీసుకున్నాను. ఈ రోజుల్లో 60 రూపాయలు పైన పెడితే కాని మంచి చీర రాదు. నాకు ఒక్కదానికే 60 రూపాయలు ఖర్చుపెడితే ఎలా? పండక్కి అత్తగారు కూడా వస్తున్నారు. ఆవిడతో పాటు ఆయన చెల్లెళ్ళిద్దరూ వస్తున్నారు. వాళ్ళకీ కొనాలి కదా! ఏదో మనమే సర్దుకోవాలి. రాక రాక వస్తున్నారు. వాళ్ళకి కాస్త మంచి బట్టలు కొనాలి. అమ్మా వాళ్ళు వచ్చేటపుడు పాతిక రూపాయలిచ్చారు. అదిసరేలే! మీ వారేం తీయబోతున్నారు నీకు?" అడిగింది సుజాత.

"ఫెస్టివల్ అడ్వాన్సు యిస్తారట. పట్టుచీర తీసిస్తానంటున్నారు. ఎన్నాళ్ళనుంచో ఆశపడుతున్నాను. ఎరుపు రంగులో పట్టుచీర కొనుక్కోవాలని. ఎప్పటికి తీరుతుందో ఏమో? అన్నట్లు చెప్పటం మరిచాను. సురేఖ బెనారస్ చీర తీసుకుంది తెలుసా? ఇవాళో రేపో మీ యింటికి వస్తుంది చూడు. చాలా బాగుంది చీర మాత్రం. దేనికయినా పెట్టి పుట్టాలి. ఏమంటావ్?"

"ఏమంటాను? చేసుకున్న వారికి చేసుకున్నంత! అయినా ఎంత డబ్బుపెట్టి కొన్నా సురేఖ కట్టుకుంటే ఏం బాగుండదు. పైగా చీరకున్న అందం పోతుంది కూడా. నువ్వు కట్టే చీరలు సాదావే అయినా అందంగా ఉంటుంది. అయినా....ఏ చీర అయితేనేం! ఏదో కట్టుకుంటే పోలే— అని నాకు మాత్రం అదే అనిపిస్తుంది. మగవాళ్ళని సాధించి కొనిపించుకున్నా దానివల్ల ఒరిగేదేమిటి? సురేఖ సంగతే తీసుకో! ఆవిడ పోరుపడలేక, ఆవిడ కోర్కెలు తీర్చలేక వాళ్ళాయన అడ్డదారి పట్టాడు. యిదివరకున్న మంచి పేరు కాస్తా పోయింది. పైగా ఈమధ్య పబ్లిక్‌గానే మొదలు పెట్టాడట. అలా సంపాదించక పోతేనేం! నాకు మాత్రం యిష్టంలేదు సుమా. మగవాళ్ళు అవినీతి పరులవటానికి ఆడవాళ్ళే కారణమంటే ఏమో అనుకున్నాను కాని, నిజమే అనిపిస్తోంది. ఏమంటావ్! నా పాలసీ—సంతృప్తే సంపద."

"ఏమో బాబూ! ఆవిడ అందర్నీ మరీ తీసి పారేస్తుంది. మొన్నీమధ్య వచ్చినపుడు ఎంత గొప్పలు చెప్పిందని....వినలేక చచ్చాననుకో. ఆవిడలా మాట్లాడుతుంటే ఉండబట్టలేక, నేనూ ఈసారి పట్టుచీర కొంటున్నానని చెప్పేశాను.

ఆవిడ కోసమయినా చీరకొనాలి. లేకపోతే రేపు ఏ పేరంటంలోనయినా పిలిస్తే నలుగురిలో పరువు తీస్తుంది. ఏమిటో .... నలుగురికీ భయపడాల్సిన బ్రతుకయిపోయింది.''

'' అదే! ఎందుకు భయపడాలి. ఎవరికున్నది వాళ్ళకుంటుంది. ఒకళ్ళకోసం ఒకళ్ళు బతుకుతున్నామా ఏం? ఏమోబాబూ! నాకలా అంటే అసహ్యం. అయినా అనవసరంగా మూడో మనిషి గురించి మనలో చర్చలెందుకు గాని, సాయంకాలం షాపింగ్ వెళ్దాం....తీరుతుందా?''

'' ఓ! అలాగే వెళ్దాంలే. కాస్సేపీ మేగజైన్ తిరగేస్తూ ఉండు. యిప్పుడే వస్తా'' నంటూ వంటయింటి వైపు వెళ్ళింది సునీత.

*

ఫెస్టివల్ అడ్వాన్సు అందుకుని సంతోషంగా చూశాడు. పాపం! చాలా బాధలో ఉన్నట్లున్నాడు. ఈ అడ్వాన్సులో సగం యిచ్చేస్తే, సునీతకి చీర కొనడం ఎలా! కొనకపోతే ఏమయినా ఉందా. ఏం చేయాలి? చీర యిపుడు కాకపోయినా మరెపుడయినా కొనుక్కోవచ్చు. కాని పోయిన ప్రాణం తిరిగిరాదు. మనిషిగా నీ కర్తవ్యం మరిచిపోకు'' అంతరాత్మ హెచ్చరించింది.

'' రామయ్యగారు! తీసుకోండి ఈ అడ్వాన్సు. ముందు మీ అబ్బాయి సంగతి చూసుకోండి. ధైర్యంగా ఉండండి. ఫరవాలేదు'' అంటూ సానుభూతిగా ఓదారుస్తూ డబ్బు ఇచ్చాడు.

''నీ మేలు ఈ జన్మలో మరిచిపోను. నీ డబ్బు ఎంత త్వరగా వీలయితే అంత త్వరగా యిచ్చేస్తాను. వస్తాను....సుందరం'' అంటూ సంతోషంగా వెళ్ళిపోతున్న రామయ్యకేసి జాలిగా చూస్తూ యింటిదారి పట్టాడు సుందర్.



గుడ్డలకు బటన్లు కుట్టాక, అందులోని దారపు పోగులకు రంగులేని నైల్‌పాలిష్ పూస్తే బటన్లు ఎంతో కాలం మన్నుతాయి.

షాపుకెళ్ళాలని మేనేజర్‌ని అడిగి పర్మిషన్ తీసుకున్నాడు సుందర్.

'' సుందరం! ఒకసారిలా వస్తావూ'' అని రామయ్య పిలవగానే—

'' ఏం కావాలండీ'' అడిగాడు సుందర్.

'' సుందర్! నీవో సహాయం చేసి పెట్టాలి. నేను నీ తండ్రిలాంటివాణ్ణనుకో. మా అబ్బాయికి కేన్సర్. ఆపరేషన్ చేయటానికి అర్జంటుగా రెండువేలు కావలసి వచ్చింది. కాస్త డబ్బు సర్దుతావని....వేరే ఎవర్నయినా అడుగుదామనుకున్నాను. నీ అంత ఆత్మీయుడు మరెవరూ నాకు లేరు. మా అబ్బాయికి వెంటనే ఆపరేషన్ చేయాలి లేకపోతే....వాడు పోతే మేము వీధిన పడతాము. ఏదో వాడు, నేనూ సంపాదించబట్టి మా సంసారం గుట్టుగా సాగుతోంది. సహాయం చేయగలవా'' దీనంగా అర్థిస్తున్న రామయ్యకేసి

ఈ రోజు ఆయనతో చెప్పెయ్యాలి. తనకు పట్టుచీర కొనవద్దని! సుజాత చెప్పినట్లు లేనిపోని ఆడంబరాలెందుకు? ఐనా రాత్రి కల తలచుకుంటే భయంగా ఉంది. తన చీర కోసం ఆయన లంచం తీసుకున్నట్లు పిచ్చి పిచ్చిగా వచ్చింది. అమ్మో! అదే నిజమయితే, ఊహుఁ: ఎన్నటికి అలా కాదు. ఆయనకి ఆఫీసులో ఎంత మంచి పేరు! ఛ. వెధవ చీర లేకపోతే పోయింది. అనవసరంగా ఆయన్ని బాధ పెట్టాను. ఏ చీర కట్టుకుంటే రోజులు వెళ్ళవుగనుక! అసలు ఈసారి చీర తీసుకోకుండా. పిల్లలకే మంచివి తీస్తేసరి. ఇలా ఆలోచించుకుంటూ మాటి మాటికి సుందర్ రాకకోసం వీధివైపు చూడసాగింది సునీత.

'' సునీతకు ఏం చెప్పాలి. ఎలా చెప్పాలి.'' అని ఆలోచించుకుంటూ ఇంటివేపు రాసాగాడు సుందర్. *

## తొలి 'వనితా' జనరల్ జి.ఎ.రామ్



కుమారి జి. ఏ. రామ్ భారత సైన్యంలో 'జనరల్' పదవి స్వీకరించిన తొలి వనితగా ఇటీవల వార్తలకెక్కారు. ఆమె భారత సైన్యం ప్రధాన కార్యాలయంలోని మిలిటరీ నర్సింగ్ సర్వీస్‌కు తొలి డైరక్టరు కూడా.

ప్రపంచం మొత్తం మీద అమెరికా, ఫ్రాన్సు దేశాలలో మాత్రమే స్త్రీలు సైన్యంలో 'జనరల్' పదవికి ఎదిగారు. ప్రస్తుతం భారతదేశం కూడా ఈ ఘనత సాధించింది.

మేజర్ జనరల్ రామ్ 1975 అక్టోబరు 30 నుంచీ బ్రిగేడియర్ స్థాయిలో 'మేట్రన్ ఇన్ చీఫ్'గా పని చేశారు. అగస్టు 27న ఆమె జనరల్‌గా పదవి స్వీకరించారు.

56 సంవత్సరాల కుమారి రామ్ 1944 లో భారత సైన్యపు నర్సింగ్ సర్వీస్‌లో లెఫ్టినెంట్‌గా చేరారు.

సశేష యథార్థగాథ

# అనుమానం పెనుభూతం

డాక్టర్ పద్మా...

మనుష్యులలో కొన్ని లోపాలూ, బలహీనతలూ కనిపిస్తుంటాయి. ఏ లోపం గానీ, బలహీనత గానీ లేని మనుషులు అరుదుగా కనిపిస్తారు. అయితే లోపం వేరు; జబ్బువేరు.

ఉదాహరణకు మనసులో అనారోగ్యకరమైన భావాలు కొన్ని ఏర్పడుతుంటాయి. కోపం, భయం, విరక్తి, అనుమానం వంటివి కలిగినప్పుడు ఆ పరిస్థితుల కారణంగా మనసు ఆందోళనకు గురి అవుతుంది. అయితే ఈ భావాలలో దేనికైనా నిరంతరంగా గానీ కొంతకాలం ఎడతెరపి లేకుండా గానీ బలి అయితే చిత్త చాంచల్యం కలుగుతుంది. కొందరికే అనారోగ్యకరమైన భావాలకు బలి కాని గుండె నిబ్బరం ఉంటుంది. ఆ నిబ్బరం లేనివారు లేనిపోనివి ఊహించుకుని తమ జీవితాలనే కాక తమ చుట్టూ ఉన్నవారి జీవితాలను కూడా బాధామయం చేస్తారు.

అవతలి మనిషి అభిప్రాయాన్ని పూర్తిగా గ్రహించే శక్తి ఏ మనిషికీ లేదు. అందువల్ల కలిగే లాభాలు ఎన్నో ఉన్నాయి; నష్టాలు కూడా అన్నే ఉన్నాయి. అటువంటి నష్టాలలో ప్రధానమైనది అవతలి మనిషిని అనుమానించే దుర్గుణం.

ఇళంగో అన్న అతను (అసలు పేరు వేరు) ఒక కంపెనీలో అకౌంటెంటుగా ఉద్యోగం చేస్తుండేవాడు. అతనికి తన పని తప్ప మరో ధ్యాస ఉండేది కాదు. అలా ఏ గొడవా లేక ప్రశాంతంగా కాలం గడుపుతూ ఉండేవాడు.

పెళ్ళి కానంతవరకూ అతనిలో ఏ మార్పూ రాలేదు. కుటుంబంలోని పెద్దలు అతనికి గీత అనే అమ్మాయితో శాస్త్రోక్తంగా పెళ్ళి చేశారు. గీత పెద్ద అందగత్తెకాదు. మంచి ప్రాయంలో ఉన్నందువల్ల ఆమె శారీరక సౌందర్యం చూపరులను ఆకర్షించేలా ఉండేది. పలకరించే కళ్ళు, సొగసైన పెదవులు ఆమెకు లేని అందాన్ని తెచ్చిపెట్టాయి.

పెళ్ళయిన కొన్ని నెలలవరకూ ఇళంగో, గీతల వంటి దంపతులు మరెక్కడా లేరు అన్నట్టుగా ఉండేది వారి అన్యోన్యత. రోజులు గడిచేకొద్దీ తన స్నేహితులుగానీ మరెవరైనా పురుషులుగానీ ఇంటికి వస్తే ఇళంగో కలవరపడేవాడు. తన భార్య వారి ముందుకు వచ్చినా, ఆమె వారికి కాఫీ వంటిది ఇచ్చినా అతనికి కంటగింపు కలిగేది.

తమ యింటికి వచ్చే ప్రతి పరపురుషుడూ తన భార్యను చూపులతో కాల్చుకు తింటున్నట్టు అతను భావించేవాడు. వారు వెళ్ళిపోయాక భార్యను ఒంటరిగా పిలిచి "నువ్వీ మధ్య అలంకారం విషయంలో భలే శ్రద్ధ చూపిస్తున్నావే?" అని ఎత్తిపొడుపు మాటలు అనేవాడు. "స్త్రీకి సిగ్గే సింగారం. అణగి మణగి ఉండని ఆడది ఆడదే కాదు. అందుకని కాస్త అణగి మణగి ఉండడం అలవాటు చేసుకో" అని సలహాలు ఇచ్చేవాడు. "ఇవాళ కాటుక బాగా ఎక్కువగా పూసుకున్నావే?" అని ఒకరోజు మండి పడితే, మరోరోజు "ఎక్కడికీ వెళ్ళకుండా ఇంట్లోనే ఉండడానికి ఇంత శ్రద్ధగా అలంకరించుకోవడం ఎందుకు?" అని భార్యను నిలదీసేవాడు.

కొంతకాలం ఇలా గడిచాక భార్య మామూలుగా చేసే ప్రతి పనిలోనూ అతనికి కొత్త అర్థాలు కనిపించసాగాయి.

మొదట్లో గీతకు తన భర్త ధోరణి అర్థం కాలేదు. ఆ తర్వాత ఆమె అతని ఇష్టప్రకారం ప్రవర్తించసాగింది. అయినా అతను ఆమెలో ఏదో వంకపడుతూనే ఉండేవాడు. ఈ పరిస్థితుల మధ్య గీత గర్భవతి అయింది.

ఐదునెలలు గడిచాయి. గీతకు మాటిమాటికీ స్పృహ తప్పడమూ, తల గిర్రున తిరగడమూ ఎక్కువయ్యాయి. ఆమె కాళ్ళు వాచాయి. ఇక ఏమాత్రమూ ఆమె ఒంటరిగా—తన గురించిగానీ, ఇంటి విషయాల గురించిగానీ పట్టించుకోవడం అసాధ్యం అన్న స్థితి ఏర్పడ్డాక పొరుగూళ్ళో ఉన్న గీత తల్లిదండ్రులు ఆమెను పుట్టింటికి తీసుకువెళ్ళారు.

ఇళంగో మనసులో గీత ప్రవర్తన గురించిన అనుమానం పెనుభూతమై ఉడలమర్రిలా వెర్రిగా

వ్యాపించింది. ఆ అనుమానం మరింత వెర్రితలలు వెయ్యడానికి అతని వెర్రిమొర్రి ఊహలు దోహదం చేశాయి.



ఒక మనిషికి మరో మనిషిపై అనుమానం కలగడానికి కారణం ఏమిటి? "అనుమానించడం అంటే తనను తానే నమ్మకపోవడం. ఇందుకు పరిస్థితులు ఎంతగానో తోడ్పడుతాయి" అన్నాడు ఒక తమిళ కవి.

వాసవదత్త కథలోని సంఘటనలు-అనుమానం మనిషిని ఎలా పెడదారి తొక్కిస్తుందో తెలియ జేస్తాయి.

మున్యాశ్రమానికి చెందిన ఒక బాలిక ఉదయ నుడి దగ్గరికి రంగు రంగుల పూలు తీసుకుని వస్తుంది. ఆ పూలను మాలగా గుచ్చి యిమ్మని అడుగుతుంది. ఉదయనుడు ఆ బాలికను సంతోష పరచడం కోసం పూలను దండగా గుచ్చి ఆ అమ్మాయి మెడలో వేస్తాడు. అదృశ్యం వాసవదత్త కంటబడుతుంది. ఆమెకు ఉదయనుడి గురించీ ఆ ముని బాలిక గురించీ ఏవేవో అను మానాలు కలుగుతాయి. తన భర్త ఆ బాలికను ప్రేమించాడేమో అని ఆమె అనుమానిస్తుంది. ఆ అనుమానం పెనుభూతం కాగా ఆమె తనను పుట్టింటికి పంపెయ్యమని భర్తకు చెప్పేదాకా వస్తుంది. (ఇక్కడ వివరించిన కథ 'పెరుంగదై' అన్న తమిళ గ్రంథంలోంచి తీసుకున్నది).

వాసవదత్త మంచి మనసులో అనుమానం అన్న విషబీజం-ఎంతటి విషఫలితాలు కలిగించిందో ఈ కథ వల్ల తెలుస్తుంది.

అనుమానానికి ఒక గొప్ప శక్తి ఉంది. అది- అసలు ఒక పని జరిగి ఉండక పోయినా ఆ పని జరిగి ఉంటే ఏర్పడే దుష్ఫలితాలను రూపొందించ గల శక్తి.

ఉదయనుడు వాసవదత్తను ఎంతగానో ప్రేమించాడు. ఆ ప్రేమ ఎటువంటిదో వాసవ దత్తకు బాగా తెలుసు. ఉదయనుడితో ఎంతోకాలం అన్యోన్యంగా దాంపత్యం చేసిన వాసవదత్త— తమ అన్యోన్యతను ఒక చిన్న పిల్ల చెదరగొట్ట గలదన్న భయం వల్లనే అనుమానం పెంచు కున్నది. ఆత్మ విశ్వాసం లేకపోవడమే ఈ భయా నికి కారణం. ఆమె తన భర్తను ఆ బాలిక తన అందంతో గానీ, శక్తితోగానీ లోబరుచుకొనగల దని నమ్మడానికి ఆధారమేమిటి?

అసలు అవతలి వారిని అనుమానించేవారు— అనుమానానికి గురైన వారిని నమ్మేటంతగా తమ ఆత్మవిశ్వాసాన్నో శక్తినో నమ్మరు. అను మానం కలిగాక అనుమానం నిజమైనదేనా అని గ్రహించే ప్రయత్నం చెయ్యక అనుమానాన్ని మరింకా ఎక్కువ చేసుకోవడానికి తగిన పరి స్థితుల కోసం అన్వేషిస్తారు. అందువల్లే అను మానించే వ్యక్తి తన ప్రశాంతతనే గాక, అను మానానికి గురైన వ్యక్తి ప్రశాంతతనుకూడా చెడ గొడతాడు. "అనుమానం మనిషి తనకూ, ప్రపం చానికీ కూడా నష్టమైనవాడి కింద లెక్క" అన్నారు గాంధీజీ ఒకసారి.

అనుమానం దుఃఖం కలిగించడం కన్నా, పగతీర్చుకునే భావాన్నే ఎక్కువ చేస్తుంది. ఆ భావమే ఈర్ష్యగా పరిణమిస్తుంది. పట్టరాని ఈర్ష్య కలిగినప్పుడు మనిషి పశువుగా మారుతాడు.



కాకరకాయలు త్వరగా పండిపోతూ ఉంటాయి. అలా అవి పండకుండా ఉండాలంటే వాటిని రెండేసి ముక్కలుగా కోసి ఉంచుకోవాలి.

సాధారణంగా ఒకవ్యక్తి ఇబ్బందులలో ఉన్నప్పుడు (ఆ వ్యక్తి మనకు అపరిచితుడైనా సరే) మనం ఆ వ్యక్తి ఇబ్బందుల గురించి బాధపడి సానుభూతి చూపుతుంటాము. కాని ఒకవ్యక్తి ఏ చీకూ చింతా లేక సంతోషంగా జీవితం గడుపుతున్నా, తన ప్రయత్నాలన్నిటిలోనూ విజయం సాధిస్తున్నా- ఆ వ్యక్తిని చూసి తక్కినవారు (ఆ వ్యక్తి తమకు ఎంత సన్నిహితుడైనా సరే) ఈర్ష్య పడతారు.

మహాభారతంలో ఇందుకొక చక్కని ఉదా హరణ కనిపిస్తుంది.

గాంధారి చాలా మంచి ఇల్లాలు; ఉత్తమురాలు. భర్తకు కళ్ళు లేనందువల్ల తానుకూడా కళ్ళు లేని దానిలా ఉండాలనుకున్న త్యాగ ప్రవృత్తి ఆమెది. కుంతీదేవి ఇబ్బందులకు గురి అయినప్పుడల్లా గాంధారి కుంతి కష్టం తన కష్టంగా భావించి ఆమె పట్ల సానుభూతి చూపేది.

అయితే కుంతికి కొడుకు పుట్టిన విషయం తెలియగానే అంత మంచి గాంధారి కూడా ఈర్ష్యతో దహించుకుపోయింది. అప్పటికి తానూ గర్భవతే. 'కడుపొచ్చినమ్మ కనక మానదు' అన్నట్టు తాను కూడా ఎప్పుడో ఒకప్పుడు తల్లికావడం జరిగి తీరుతుంది. అయినా కుంతి మీది ఈర్ష్య గాంధారిని సవ్యంగా ఆలోచించనివ్వలేదు. ఆమె తన ఈర్ష్యను తన గర్భం మీద ప్రదర్శించింది. ఒక అప్పడాలకర్రను తీసుకుని తన గర్భాన్ని అదే పనిగా కొట్టిందట! అందువల్లే ఆమె గర్భంలోని పిండం నూరు భాగాలుగా చెదిరి కౌరవులు జన్మించా రని అంటారు.

తనకు చాలాసన్నిహితురాలైన కుంతి జీవితంలో ఒక ఆనందదాయకమైన సంఘటన జరిగితే ఉత్తమురాలైన గాంధారే ఓర్చుకోలేకపోయింది!

దుర్మార్గులు—అనుమానంవల్ల గానీ, ఈర్ష్య వల్లగానీ ఇతరులకు కీడు చేస్తే తక్కినవారు దాన్ని గురించి విన్నప్పుడు 'ఈ మంచి మనిషికి అంతటి కీడు జరిగి ఉండకూడదు. అయినా అవతల మనిషి దుర్మార్గుడు. ఏంచేస్తాం?' అనుకుని బాధపడతారు.

అదే మంచి వ్యక్తులుగా, సౌశీల్యవంతులుగా పేరు గడించిన వ్యక్తులు అనుమాన పిశాచి పీడకు గురై దారి తప్పినా, కాలు జారినా, ఆ విషయం— పరిచితులనందరినీ కదిలిస్తుంది; అదురుపాటుకు గురి చేస్తుంది. 'అంత మంచి వ్యక్తి ఇంతగా దిగజారాడా?' అని పదేపదే విచారిస్తారు.

ఈ అభిప్రాయాన్ని దృష్టిలో ఉంచుకునే ఆంగ్ల మహాకవి షేక్స్పియర్ తన విషాదాంత నాటకాలలో ప్రముఖ స్థానం వహించిన 'ఒతెల్లో'ను రూపొందించాడు.

'ఒతెల్లో' నాటకంలోని నాయక పాత్రధారి అయిన ఒతెల్లో పరిస్థితే ఇశంగోకు కూడా వచ్చింది.

(సశేషం)



# అందమైన శరీరానికి ఐసోమెట్రిక్స్

శ్యామలా చంద్రన్

**లావుగా ఉన్నామని విచారించేవారూ, శరీరం సొగసుగా లేదని చింతించేవారూ మనలో చాలామందే ఉండవచ్చును. అయితే లావు తగ్గడానికీ, శరీరం అందంగా ఉండడానికీ ఏం చెయ్యాలి? కొందరు ఆహారం తగ్గించమంటారు. మరి కొందరు వ్యాయామం చెయ్యమంటారు. కేవలం ఆహారం తగ్గించినా, కేవలం వ్యాయామం మాత్రం చేసినా అంతగా ప్రయోజనం ఉండకపోవచ్చును. 'వ్యాయామం చెయ్యడానికి తీరిక ఏది?' అని విచారించే వారూ ఉండవచ్చు. అలా విచారపడేవారికీ, లావు తగ్గదలుచుకున్న వారికీ—చక్కని నివారణ కల్పించి, శరీరానికి కొత్త అందాలు తెచ్చి పెడతాయి 'ఐసోమెట్రిక్స్' అన్న కొత్త తరహా వ్యాయామాలు. ప్రస్తుతం ప్రపంచం మొత్తం మీద చాలామంది ఐసోమెట్రిక్స్ ద్వారా కొన్ని వారాల్లోనే 'అందమైన శరీరం' పొంది ఆరోగ్యవంతులవుతున్నాడు. మద్రాసులో శ్రీమతి శ్యామలా చంద్రన్ అన్న ఆమె, డాక్టర్ చిన్నకృష్టన్ అన్న ఆయనా కలిపి 'స్లిమ్ వైస్ క్లినిక్' పేరిట నడుపుతున్న సంస్థ 'ఐసోమెట్రిక్స్' ద్వారా ఎందరికో సాయపడుతున్నది. శ్రీమతి శ్యామలా చంద్రన్ 'వనిత' పాఠకులకు 'ఐసోమెట్రిక్స్' గురించి ఈ శీర్షికలో ప్రత్యేకంగా వివరిస్తున్నారు. ఈ శీర్షిక పాఠకులకు ఉపయోగకరంగా ఉండగలదని భావిస్తున్నాము.**

చాలామంది తాము లావుగా ఉన్నామనుకుంటారు. నిజానికి అటువంటి వాళ్ళ ఇబ్బంది – శరీరంలో అనవసరమైన చోట్లలో కండలు మొయ్యడమే! అలా లావుగా ఉన్నామనుకున్న వారు తిండి తగ్గించి తిప్పలుపడి అనారోగ్యం పాలవుతారు. మరికొందరు బరువు మాట ఎలా ఉన్నా శరీర సౌష్ఠవం చెడకూడదనుకుంటారు. మరి కొందరి 'లావు' వంశ పారంపర్యంగానే వస్తుంది. అటువంటి వారు సన్నబడడం అన్నది కాస్త అనుమానమైన విషయమే! అయినా వారు కూడా ప్రయత్నిస్తే, కాస్త సన్నబడడం పెద్ద సమస్యేమీ కాదు. ఇక్కడ పేర్కొన్న వారిలో ఎవరైనా తమ శరీరాలను అందంగా, పరిమితంగా, ఆకర్షణీయంగా ఉంచుకోవడానికి 'ఐసోమెట్రిక్స్ విధానం' తోడ్పడుతుంది.

"'ఐసోమెట్రిక్స్ విధానం' అంటే ఏమిటి? ఈ పేరేదో కొత్తగా ఉందే?" అని ప్రశ్నించే వారికి సమాధానం: ఐసోమెట్రిక్స్ విధానం అంటే శరీరానికి అందమైన ఆకారాన్ని కలిగించే సులభమైన కదలికలతో చేసే వ్యాయామమే.

శరీరంలో రెండు బిందువుల మధ్య ఉన్న భాగానికి ఒత్తిడి కలిగించినప్పుడు అక్కడి కండరాల పోగులు ముడుచుకుపోతాయి. ఆ శరీర భాగం ఇటూ అటూ కూడా కదలలేక సర్దుకుపోతుంది. దీన్నే ఐసోమెట్రిక్ విధానం అంటారు.

ఇదంతా గజిబిజిగా కనిపించవచ్చు. గుండె కొట్టుకోవడానికి కొన్ని కండరాలు పనిచేస్తాయి; ఊపిరి పీల్చడానికి ఊపిరితిత్తులను కొన్ని కండరాలు పనిచేయిస్తాయి. ఇలా శరీరంలో ప్రతి అవయవమూ పని చెయ్యడానికి కొన్ని కండరాలు తోడ్పడుతుంటాయి. వాటిని సక్రమంగా కదిలిస్తే ఆరోగ్యం లభిస్తుంది.

శరీరం లావెక్కేకొద్దీ, కదలకుండా ఉండే బావుండుననిపిస్తుంది. బరువు తగ్గడానికి 'డయటింగ్' చెయ్యమనే డాక్టర్లు—వ్యాయామం చెయ్యమని కూడా చెబుతూ ఉంటారు. 'ఇంత శరీరమూ వేసుకుని ఎలా వ్యాయామం చెయ్యడం?' అన్న సిగ్గుతోనూ, 'రోజూ బోలెడంత పనిచేస్తున్నాను. తిండి తగ్గించాను. లావు అదే తగ్గుతుందిలే' అనుకోవడంతోనూ, బద్ధకంతోనూ చాలామంది వ్యాయామాలు చెయ్యరు.

ఇటీవల చాలామంది యోగాసనాలు వెయ్యడానికి పూనుకుంటున్నారు. యోగాసనాలు శరీరానికి ఎంతో మేలు చేస్తాయి. అయితే రోజుకు కనీసం ముప్పావుగంటో, గంటో వాటికోసం శ్రమించడానికి—రకరకాల అటంకాలు వస్తుంటాయి. 'ఇవాళంతా ఇంటి పనితో సరిపోయింది. యోగాసనాలు రేపు వేద్దాంలే' అనో, మరేదో కారణం వల్లో రోజూ యోగాసనాలు వెయ్యడానికి కుదరక పోవచ్చు.

అందువల్ల అట్టే కాలం తీసుకోనివీ, అందరూ సులభంగా చెయ్యదగ్గవీ అయిన వ్యాయామాలు చెయ్యడం సులభంగా ఉంటుంది. ఐసోమెట్రిక్స్ విధానంలో అటువంటి వ్యాయామాలు ఉన్నాయి. ఈ విధానంలో ఒక్క కండరాన్ని కూడా కదల్చకుండా, 6 నుంచి 10 సెకండ్ల వ్యాయామంతో శరీరాన్ని దృఢంగా, ఆకర్షణీయంగా రూపొందించుకోవచ్చు.

అదీకాక ఇవి చెయ్యడానికి విడిగా ఒకచోటు గానీ, సమయంగానీ అక్కరలేదు. వంటింట్లోనో, బస్సు కోసం నిలబడ్డప్పుడో, సినిమా థియేటర్లోనో ఎక్కడైనా ఈ వ్యాయామాలు చెయ్యవచ్చు. (ఆఫీసుల్లో పని చేస్తున్న వారు ఆఫీసుల్లో కూడా చెయ్యవచ్చు!)

అలాగే ఈ వ్యాయామాలు చెయ్యడానికి వయసుతో పని లేదు. పిల్లల నుంచి పెద్దలదాకా అందరూ వీటినిచేసి లాభం పొందవచ్చు. బాగా ఆరోగ్యంగా ఉన్నవారే కాక జబ్బుపడి కోలుకుంటున్న వారూ కూడా ఇవి చెయ్యవచ్చు.

ఈ వ్యాయామాలు చెయ్యడం ప్రారంభించిన కొంత కాలంలోనే తేలిగ్గానూ హాయిగానూ ఉన్నట్లనిపిస్తుంది. ఎక్కువ శ్రమ చెయ్యడానికి వీలుంటుంది. శక్తి పెరుగుతుంది. లావు తగ్గడం కోసం తిండి తగ్గించి కృశించినవారు కాస్త బలహీనంగా ఉంటారు. ఐసోమెట్రిక్స్ విధానం వారికి బలం చేకూర్చి త్వరగా సన్నబడేలా చేస్తుంది (అయితే శక్తి మాత్రం పెరుగుతూనే ఉంటుంది).

---



పచ్చిమిరపకాయలు పండిపోకుండా ఉండడానికి వాటి కాడలను తుంచి, వాటిని విడిగా ఉంచుకోవచ్చు. బెండకాయలు, బీన్స్, గోరుచిక్కుడుకాయలు మొదలైనవి వాడిపోకుండా, ముదరకుండా ఉండడానికి కూడా వాటి కాడలు తొలగించే నిలవచేస్తేచాలు.

---

దీపం చేతబట్టుకుని నిలబడిన అందమైన స్త్రీల విగ్రహాలను చూస్తే—తమ భంగిమను సరిగా ఉంచుకుండే స్త్రీలు ఎంత అందంగా కనిపించగలరో తెలుస్తుంది. అందం అన్నది రకరకాలుగా ఉంటుంది. పొట్టిగా ఉన్న వ్యక్తులు పొడవరులను చూసి ఈర్ష్యపడుతూ ఉంటారు. లావుగా ఉన్నవారు సన్నగా ఉన్నవారిని చూసి అసూయపడుతూ ఉంటారు. ఇలా ఎవరికి వారు తక్కిన వారిలా తాము లేమే అనుకుండే లాభంలేదు. పుట్టినప్పుడు స్వతహాగా వచ్చిన అందాన్ని రక్షించుకోవడం, దాన్ని పెంపొందించుకోవడం చేస్తే చాలు!

ఇంకొకరిలా కనిపించడం కోసం వారి సౌందర్యాన్నీ, ఆకారాన్నీ తెచ్చుకోవడానికి ప్రయత్నించడం వ్యర్థం. 'ఉన్నంతలో అందాన్ని సాధించడం ఎలా?' అన్న ప్రశ్నకు ఐసోమెట్రిక్స్ విధానం చక్కని సమాధానం.

'ఐసోమెట్రిక్స్ విధానం' ఖరీదెంత? ఈ విధానం ప్రకారం వ్యాయామాలు చెయ్యడానికి ఏమేం కావాలి?

ఐసోమెట్రిక్ విధానం చాలా చౌక. ఈ విధానం ప్రకారం వ్యాయామం చెయ్యడానికి మీ చేతులూ కాళ్ళూ మీ శరీరమూ—ఇవే కావలసిన పరికరాలు. బల్ల, కుర్చీ, వాకిలి, తలుపు వంటివే కావలసిన తక్కిన పరికరాలు. వీటినిబట్టే ఈ విధానం అట్టే ఖరీదైనది కాదని తెలుసుకోవచ్చు.

పిల్లలను కన్న స్త్రీలు కూడా కాన్పు జరిగిన 10 నుంచి 18 రోజుల తర్వాత ఐసోమెట్రిక్స్ వ్యాయామాలు చెయ్యవచ్చు.

ఇవ్వాళ్టి రోజుల్లో చాలామంది స్త్రీలు ఒకరిద్దరు పిల్లలను కన్నాక వారికి అసహ్యంగా బొజ్జ పట్టేయడం జరుగుతుంటుంది. ఇదివరలో అయితే పెద్దవాళ్ళు—కాన్పు కాగానే కడుపు చుట్టూ ఒక చీరెనో, గుడ్డనో కట్టి ఉంచేవారు. అలా కడుపు జారిపోవడానికి అవకాశముండేది కాదు. ఆ కట్టు ఉండడంవల్ల మితంగా భోంచేసేవారు. అలా కూడా కడుపు దిగిపోయేది కాదు. ఇప్పట్లో కాన్పు అయ్యాక కాన్పు బెల్టు వేసుకోవడమో, వ్యాయామం చెయ్యడమో చెయ్యాలి. ఇవేవీ లేకపోతే పొట్ట పెరిగి అలా బానలా నిలిచిపోతుంది! ఐసోమెట్రిక్స్ విధానం ద్వారా ఈ అవస్థ కలగకుండా కడుపును జారనీయక అందంగా ఉంచుకోవచ్చు.

బాలబాలికలు కాస్త పొడుగు ఎదగడానికీ, గూను ఉన్నవారు అది పోగొట్టుకోవడానికీ ఈ వ్యాయామాలు తోడ్పడుతాయి.

యోగాసనాలలో కూడా ఐసోమెట్రిక్స్ కదలికలు కొన్ని ఉన్నాయి. అయితే యోగాసనాలలో ఉన్నట్టు ఐసోమెట్రిక్స్‌లో శరీరాన్ని వంచే వీలు లేదు. యోగాసనాలవల్ల శరీరానికి బలం చేకూరదు. ఐసోమెట్రిక్స్ విధానం శరీరానికి బలం కలిగిస్తుంది. యోగాసనాలూ, ఐసోమెట్రిక్ విధానమూ కలగలిసి ఉన్న యోగాసనాలు చేస్తే శరీరానికి మరింత మంచిది.

ఇక్కడ ఐసోమెట్రిక్స్ విధానం గురించి తెలుసుకున్నాము. ఇక ఈ విధానాన్ని అనుసరించడానికి అవసరమైన శరీర స్థితి గురించీ, చెయ్యదగ్గ వ్యాయామాల గురించి రానున్న సంచికలలో తెలుసుకుందాము.

# 4

సిగ్గుపడింది రుక్మిణి. దుఃఖాన్ని అదుపు చెయ్యలేనందుకు....

తల వంచుకొని మెల్లగా అనసూయ వెంట వంటింట్లోకి వెళ్ళింది.

అక్కడ డైనింగ్ ఛెయిర్‌లో కూర్చుని టిఫిన్ తింటున్నాడు ప్రకాశరావు.

"ఏమ్మా! ఎలా వున్నారు? మాధవరావుగారు కులాసాగా వున్నారా?"

లోపల బాధను దాచుకొని, పైకి నవ్వుతూ వుండే రుక్మిణంటే అతనికి అభిమానం.

"కులాసాగానే వున్నామండీ!" అంటుంటే రుక్మిణి గొంతుకు వెక్కిళ్ళు అడ్డుపడ్డాయి.

"ఎందుకమ్మా రుక్మిణీ! దేనికో బాధ పడ్తున్నట్లున్నావు?" ఆదరంగా అడిగాడు అతను.



అతని అభిమానానికి రుక్మిణి కళ్ళు చెమ్మగిల్లాయి మళ్ళీ.

చెప్పమన్నట్లుగా రుక్మిణి చెయ్యి నొక్కింది అనసూయ.

"మాకు రవిచంద్రని పెంచుకోవాలని వున్నదండి. మీ కిష్టమైతే...." సగంలో ఆపేసింది. అతడు నోట్లో పెట్టుకోబోతున్న పూరీని ప్లేట్లో వదిలేశాడు.

"ఇలా అడిగానని మీరేమీ అనుకోవద్దు. మీకు కష్టం కలిగించి ఉంటే నన్ను క్షమించాలి!"

వెంటనే జవాబివ్వలేదు అతను.

"నువ్వు వాడిని వదిలి వుండగలవా?" ఎదురు ప్రశ్న వేశాడు అతను.

సమాధానం చెప్పలేక పోయింది ఆమె.

"ఇద్దరు మొగపిల్లలూ, ఇద్దరు ఆడపిల్లలే నీకు పుట్టారనుకోగలవా? రవిని మర్చిపోగలవా?" అతనలా అంటుంటే వినలేక చెవులు మూసుకున్నది అనసూయ.

"ఊహనే భరించలేని దానివి .... వాస్తవాన్ని అనుభవించ గలవా?"

పెద్దకథ:




## ఉండవల్లి జయశ్రీ

గబగబా అనేసి 'నేను వెళ్ళొస్తాను అనసూయా!' అని, మరో మాటకి అవకాశం ఇవ్వకుండా వాకిట్లోకి నడిచింది రుక్మిణి.

"రుక్మిణీ! కొంచెం ఆగు. ఈ టిఫిన్ తిని వెళ్ళు." వెనకనించి అనసూయ అరుస్తున్నా వినకుండా ఇంటిదారి పట్టింది రుక్మిణి.

ఆ రాత్రి మాధవరావు అడిగాడు. "అనసూయా వాళ్ళింటికి వెళ్ళొచ్చావా? రవిచంద్ర విషయం అడిగావా?"

"వెళ్ళాను. అడిగాను. వాళ్ళింకా ఏం చెప్పలేదు. అసలెప్పటికైనా చెప్తారో లేదో తెలియదు....." మరో మాట మాట్లాడాల్సింది ఏమీ లేదన్నట్లుగా దుప్పటి కప్పేసుకుంది ఆమె.

'ప్రకాశరావుగారు వున్నారా?' అన్న మాధవరావు ప్రశ్నకు 'ఆ' అని దుప్పట్లోంచే జవాబిచ్చింది రుక్మిణి.

*

అనసూయ ప్రకాశరావుని అడిగింది. "ఏమంటారు? రవిని రుక్మిణికి ఇద్దామంటారా?"

"మరెలాగండీ? అది ఎంతో బాధపడ్తున్నది. నన్నేం చెయ్యమంటారు? రుక్మిణికి ఏం జవాబు చెప్పమంటారు?" భారమంతా అతనికే వదిలేసింది ఆమె.

"నిజంగా రుక్మిణిని చూస్తుంటే జాలివేస్తున్నది. చూస్తూచూస్తూ రవిని పరాయి ఇంటి బిడ్డని చెయ్యలేము. ఏం చెయ్యాలో నాకూ ఏమీ తోచటం లేదు. తల నొప్పిగా వుంది. ముందు కొంచెం మందురాయి. తర్వాత ఆలోచిద్దాము..." అని అతను కళ్ళుమూసుకు పడుకున్నాడు.

అతని నుదుటికి మందు రాస్తూ మెల్లగా అన్నది అనసూయ: "ఏదో ఒకటి త్వరగా ఆలోచించండి. రుక్మిణికి దిగులు ఎక్కువైపోతున్నది."

"రవిని పెంచే విషయంలో ఆవిడ నీ కంటె ఎక్కువగానే చూస్తుంది. చేస్తుంది. అందులో సందేహం లేదు." సాలోచనగా అన్నాడు అతను.

"నా కంటే ఏమిటీ? తన ప్రాణం కంటె ఎక్కువగా చూసుకుంటుంది రవిని. మనం ఇప్పుడు బాధపడాల్సింది....భయపడాల్సింది 'రవిని వదిలి మనం వుండగలమా? రవి మన కోసం బెంగపెట్టుకోకుండా వుంటాడా?' అని. ఏమంటారు?"

"నువ్వు కూడా మనస్ఫూర్తిగా ఇష్టపడితే రవిని దత్తత ఇవ్వటానికి నాకేం అభ్యంతరం లేదు అనసూయా!" చివరికి తేల్చి చెప్పాడు ప్రకాశరావు.

కళ్ళు మూసుకు పడుకుంటే రుక్మిణి దీన వదనమే మళ్ళీమళ్ళీ గుర్తుగు వస్తుంటే అతను భరించలేకపోయాడు. నిద్రపోలేకపోయాడు.

అనసూయను లేపి ఆ మాట చెప్పిన తర్వాత అతను తృప్తిగా నిద్రపోయాడు. ఆ క్షణం నుంచీ మళ్ళీ నిద్రపట్టలేదు అనసూయకు.

"నాకే పరీక్ష ఎదురయిందేమిటి? ఒక పక్క ప్రాణ స్నేహితురాలు. మరోపక్క కన్నకొడుకు. నాకు ఇద్దరూ కావాలి. ఇద్దరి సుఖ సంతోషాలూ కావాలి. నన్నేం చెయ్యమంటావు భగవాన్! కాదని రుక్మిణి బాధను చూడలేను. అవునని రవికి దూరంగా వుండలేను. నాకేది దారి? నాచేత నువ్వేం చేయించదలిచావో తండ్రీ! నీకే తెలియాలి." ఎదురుగా వున్న దేవుడికి నమస్కరిస్తూ అనుకున్నది అనసూయ.

తెల్లవారి లేస్తూనే రవిని అడిగింది.

"ఆంటీ వాళ్ళింటికి వెళ్తావా రవీ? ఆంటీ అంటే నీకిష్టమేనా?" వాడిని పరీక్షగా చూస్తూ అన్నది.

"ఓ! ఆంటీ అంటే నాకు చాలా ఇష్టం. బోలెడన్ని స్వీట్లు పెడ్తుంది. బొమ్మలు కొని పెడ్తుంది. వెళ్తాను. ఎప్పుడు వెళ్ళమంటావు అమ్మా!"

రవి ముద్దు మాటలకు నవ్వింది అనసూయ.

"ఎప్పటికీ అక్కడే వుంటావా?"

"నువ్వు కూడా వస్తావా?" తల్లిని అడిగాడు.

"నేను రాను. నువ్వు వాళ్ళింట్లో వుండి చదువుకోవాలి. వెళ్తావా?"

"ఎందుకమ్మా! మనింటికి బడి దగ్గరగానే వుందిగా! నువ్వు రాకపోతే ఆంటీ దగ్గరకు నే వెళ్ళను." అనసూయ చీర కుచ్చెళ్ళలో ముఖం దాచుకుంటూ అన్నాడు రవి.

చప్పున ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి.

"అలా అనకూడదు బాబూ! ఆంటీకి నువ్వంటే ఎంతో ఇష్టం. అంకుల్ కూడా

నిన్నెంతో బాగా చూస్తారు. వాళ్ళింటికి వెళ్తావా?" తల నిమురుతూ అన్నది.

"నువ్వు వస్తే వెళ్తాను. లేకపోతే వెళ్ళనే వెళ్ళను." తల్లిని తప్పించుకుని తండ్రి దగ్గరకు పరుగెత్తుకుంటూ వెళ్ళాడు. "నాన్నా! నాన్నా! తెల్లవారిపోయింది. ఇంక నిద్రపోగూడదులే!"

తండ్రిని తన చిట్టి చేతుల్తో తట్టి లేపుతూ అన్నాడు.

"బాబూ! నువ్వు ఆంటీ వాళ్ళింట్లో ఉంటావా?" కళ్లు విప్పుతూనే అడిగాడు ప్రకాశరావు.

"ఎందుకు నాన్నా?"

"ఎందుకంటే...." ఆ తరువాత ఏం చెప్పాలో తెలియక తల గోక్కున్నాడు అతను.

"ఆంటీకి, అంకుల్‌కి నువ్వంటే ఇష్టం. అందుకని వాళ్ళ దగ్గర కొన్ని రోజులుండి రా!"

"మరి అమ్మ కూడా వస్తుందా? చెల్లాయిని కూడా తీసుకెళ్ళనా?"

"నువ్వు ముందు వెళ్ళిపో! మేము తర్వాత వస్తాము. వాళ్ళు నీకు బోలెడన్ని బట్టలు కుట్టిస్తారు. ఎన్నో స్వీట్లు పెడతారు. మరి వెళ్తావా?"

"మీరందరూ ఎప్పుడు వస్తారు?"

"నువ్వు వెళ్ళగానే మేమూ వస్తాము. నువ్వు ఆంటీని అమ్మా అని, అంకుల్‌ని నాన్నా అని పిలవాలి.... తెలిసిందా?" ప్రకాశరావు గొంతు వణికింది.

"అలా ఎందుకు పిలవాలి నాన్నా? ఆంటీ అని ఎందుకు పిలవకూడదూ?"

ఆ పసివాడి ప్రశ్నలకు ప్రకాశరావు జవాబివ్వ లేక పోయాడు. అప్పుడే అక్కడికి వచ్చిన అనసూయ అందుకున్నది.

"ఎవ్వరికి ఏమీ కొని పెట్టకుండా అన్నీ నీకే ఇస్తుందికదా ఆంటీ! నీకేది కావాలంటే అది కొని పెట్టుందికదా! అందుకని అమ్మా అని పిలవాలమ్మా! ఏం?" బుజ్జగిస్తున్నట్లుగా అన్నది.

"నేను పిలవను!" తల ఎగరేస్తూ నిర్లక్ష్యంగా అన్నాడు రవి.

"ఎలాగండీ వీడితో? రుక్మిణికి ఏమని చెప్పాలి?"

"'రవిని మీకు దత్తత ఇవ్వటానికి మాకేం అభ్యంతరం లేదు. వాడు మిమ్మల్ని 'అమ్మా నాన్నా' అని పిలవటం మా చేతుల్లో లేనిపని. రవి ఎప్పటికైనా మిమ్మల్ని తల్లీ తండ్రిగా గుర్తిస్తాడనుకుంటే పెంచుకోండి. లేకపోతే నెలల పిల్లవాడిని తెచ్చుకోండి!' అని చెప్పు. వాళ్ళేమంటారో కనుక్కో!" ప్రకాశరావు పక్క మీద నుంచి లేస్తూ అనసూయతో అన్నాడు.

*

ఆ సాయంత్రం రవిని తీసుకొని రుక్మిణి దగ్గరకు బయల్దేరింది అనసూయ. దిగులుగా శూన్యంలోకి చూస్తూ కూర్చున్న రుక్మిణిని చూడగానే అనసూయ మనసులో స్థిరనిశ్చయం కల్గింది. 'ప్రాణ స్నేహితురాలికి మనశ్శాంతి కల్గించాను అన్న తృప్తినైనా మిగుల్చుకుంటాను' అనుకున్నది ఆమె అడుగు లోపలికి వేస్తూ.

"రుక్మిణీ!"

ఉలిక్కిపడి చూసింది రుక్మిణి.

"నేను రుక్మిణీ! అనసూయను వచ్చాను. ఏమిటలా చూస్తావు?" భయంగా అన్నది.

"నువ్వు మళ్ళీ మా ఇంట్లో అడుగు పెడ్తావనుకో లేదు అనసూయా! నా తెలివి తక్కువ మాటల్ని పట్టించుకోకుండా వచ్చావు. నిన్నటి నా ప్రవర్తన నిన్ను చాలా బాధపెట్టి వుంటుంది. నన్ను క్షమించు!" చీర కొంగుతో కళ్ళు తుడుచుకుంటూ అన్నది రుక్మిణి.

"ఏమిటా పిచ్చి — రుక్మిణీ? ప్రతి దానికి ఏడుపేనా? కన్నీరు చాలా విలువయింది. ముందు వెళ్ళి ముఖం కడుక్కురా! నీకో మంచి మాట చెప్పాలని వచ్చాను." ఊరిస్తున్నట్లుగా అన్నది అనసూయ.

"ఆ మంచి మాట ఏమిటో ముందు చెప్పు. తర్వాత తీరిగ్గా టాయిలెట్ అవుతాను. నా ప్రాణం తియ్యక త్వరగా చెప్పు అనసూయా!" అనసూయ భుజంమీద చెయ్యివేసి అన్నది రుక్మిణి ఆదుర్దాగా.

"రవిని దత్తత ఇవ్వటానికి మావారు ఒప్పుకున్నారు...."

"నిజంగానా?" అనసూయ మాట పూర్తి కాకుండానే మధ్యలో గట్టిగా అరిచింది రుక్మిణి. సమాధానం కోసం ఎదురు చూడకుండానే "రవీ నా తండ్రీ! ఇన్నాళ్ళకి ఈ అమ్మ గుర్తుకొచ్చిందా? నీకేం కావాలో అడుగు.... అన్నీ ఇస్తాను. కాని నన్ను విడిచి మటుకు ఎక్కడికీ వెళ్ళకు!" అంటూ రవిని ఎత్తుకొని గిరగిరా తిప్పింది.

ఆ పిచ్చి ప్రేమకు ఆశ్చర్యపోయింది అనసూయ.

"అవును రుక్మిణీ! రవిని ఎప్పటికీ నీకు ఇవ్వటానికే మేము నిర్ణయించుకున్నాము. కాని.... వాడు అమ్మా నాన్నా అని మిమ్మల్ని పిలుస్తాడో లేదో?" సందేహంగా అన్నది అనసూయ.

"ఆం, ఎందుకు పిలవడు? వాడే పిలుస్తాడు. వద్దనేదాకా పిలుస్తాడు. ఏం నాన్నా! నన్ను అమ్మా అని పిలవ్వూ?" రవి బుగ్గమీద ముద్దు పెట్టుకుంటూ అన్నది రుక్మిణి.

"ఊహుం నేను పిలవను!" రవి కచ్చితంగా చెప్పాడు.

విలవిలలాడింది రుక్మిణి మనసు; తెల్లబోయినట్లు చూసింది అనసూయవంక.

"అమ్మా అని పిలవాలి రవీ! ప్రొద్దుట్నుంచీ నేను చెబుతున్నదంతా ఏమయింది?" కోపంగా అన్నది అనసూయ.

"అమ్మా!" అని పిలుస్తూ అనసూయ దగ్గరికి వెళ్ళాడు రవి.

"నన్నుకాదు....ఆంటీని అమ్మా అని పిలవాలి. వెళ్ళు ఆంటీ దగ్గర....ఆంటీకాదు—మీ అమ్మ దగ్గరకెళ్ళి కూర్చో!" పళ్ళబిగువున దుఃఖాన్ని ఆపుకుంటూ రవిని పక్కకు నెట్టింది అనసూయ.

"నువ్వు మా అమ్మవి కావా అమ్మా?" కళ్ళను పెద్దవి చేస్తూ ఆశ్చర్యంగా అడిగాడు రవి.

ఆ ప్రశ్నకు జవాబు చెప్పలేక కిటికీ దగ్గరకు వెళ్ళి బయటకు చూస్తూ నిలబడింది అనసూయ.

"ఆంటీ! నిన్ను అమ్మా అని ఎందుకు పిలవాలి?" రుక్మిణిని అడిగాడు.

సరైన సమాధానం, తృప్తి కల్గించే జవాబు చెబితే పిలవటానికి సిద్ధంగా వున్నట్లు నోరు తెరిచి రుక్మిణినే చూస్తూ నిలబడ్డాడు రవి.

'అవును....నిజమే....తన్నెందుకు పిలవాలి? తనేం నవమాసాలు మోయలేదే? స్త్రీకి పునర్జన్మ అనే కాన్పు కష్టం తనేం అనుభవించలేదే? పెంచటం ఎంతో కష్టమయిన పనితనాన్ని తనేం భరించలేదే? మరెందుకు పిలవాలి? ఏ రక్త సంబంధమూ లేని పరాయిదాన్ని అమ్మా అని ఎందుకు పిలవాలి?' ఒక్క ప్రశ్నకూ జవాబు దొరకలేదు రుక్మిణికి.

"నువ్వంటే నాకు చాలా ఇష్టం. నిన్ను కంటికి రెప్పలా చూసుకుంటాను. మా ఇంట్లో వుంటావా?" రవిని దగ్గరికి రమ్మని చేతులు జాస్తూ అన్నది రుక్మిణి.

రవికి ఆ మాటలు అర్థమయినట్లు లేదు. విసుగ్గా ముఖం పెట్టి "అమ్మా! ఇంటికెళ్ళి పోదాం రా!" అన్నాడు. అనసూయ వెనక్కి తిరిగి చూడలేదు.

"రవీ! ఈ బిస్కెట్లు తిని వెళ్ళు" బిస్కెట్ ప్యాకెట్ రవి చేతికందించి ఎత్తుకున్నది రుక్మిణి. ఆ ప్యాకెట్లు చేతిలో పడగానే రవికి ఎక్కడలేని కబుర్లు గుర్తుకొచ్చాయి. స్కూలుకు తీసుకెళ్ళే ఆయా గురించి, ఎప్పుడూ బలపాలు అడుగుతూ వుండే నీతూ గురించి, స్కూలు టీచరు గురించి, ఆపకుండా ఏడ్చే చెల్లెలి గురించి, ఆటలు ఆడే అన్నయ్యల గురించి....ఇలా చెప్పిన కబురు చెప్పకుండా చెప్పాడు.

దానితో రుక్మిణి మనసు కొంచెం తేలిక పడింది.

అనసూయ గుండె బరువెక్కింది.

"ఇలాగే కొన్ని రోజులపాటు పంపిస్తాను. రవికి నువ్వు బాగా అలవాటవుతే అప్పుడు మా గురించి బెంగపెట్టుకోడు." గద్గదంగా అన్నది అనసూయ.

"సారీ! అనసూయా! మిమ్మల్ని చాలా బాధపెడ్తున్నాను."

"అలవాటయ్యేదాకే బాధ....ఆ తర్వాతే అసలు కథ మొదలవుతుంది."

'టాటా' చెబుతున్న రవిని కనుమరుగయ్యే దాకా చూసి లోపలికి వెళ్ళింది రుక్మిణి.

అదుపులో పెట్టలేని ఆనందంతో వున్న అర్ధాంగిని చూడగానే అర్థం చేసుకున్నాడు మాధవరావు.

"అనసూయ వచ్చి వెళ్ళిందా?"

"ఊఁ శుభవార్త చెప్పి వెళ్ళింది." నవ్వుతూ అన్నది.

"రవిని ఇస్తానన్నారా? ప్రకాశరావుగారు ఒప్పుకున్నారా?" అనుమానంగా అడిగాడు.

"అందుకేగదా ఈ సంతోషమంతా! వరుసగా కొన్నిరోజులపాటు రవిని పంపిస్తానన్నది. మనం బాగా అలవాటు చేసుకుంటే...."

"మనం కాదు....రవికి మనం అలవాటు కావాలి!" మాటకడ్డువస్తూ అన్నాడు మాధవరావు.

"అదేలెండి! ఒకళ్ళకొకళ్ళం అలవాటవుతే..."

"రోజులు గడుస్తుంటే అదే అలవాటవుతుంది గాని....వాడు అమ్మా నాన్న అని పిలుస్తా

## చెప్పాలని వుంది మీకు

ప్రియమైన మీకు,
నా తోడుకి, నీడకి
తళుక్కుమనే తారలు మీ కళ్ళని,
ఆ కనుపాపల కదిలే భాగ్యం నాదని,
చిరుహాస్యం లాస్యం చేసే
పెదవులు మీవని,
ఆ నవ్వుల పువ్వులు నాకేనని,
తేనెకన్న తీయని పలుకు మీదని,
ఆ పలుకులు విని పులకించే కలికి నేనని,
తలదాచుకోవాలనిపించే హృదయం మీదని
ఆ ఎదపై ఒదిగి ఇలను
మరిచేది నేనేనని,
మల్లెకన్న తెల్లని మనసు మీదని
ఆ మనసున మనసై నిల్చిన మగువ నేనని
మన దాంపత్య రథసారథి మీరేనని
మీ అడుగు జాడల నడిచే అర్ధాంగి నేనని,
చీకటిని వెలుగుగా, బాధను నవ్వుగా
చూపిన ప్రేమమూర్తి మీరని
మీ అనురాగ రాగిణిని నేనని,
నాకు తెలుసని,
చెప్పాలని వుంది మీకు!
ఇట్లు
ప్రేమతో
మీతో కదిలే నేను,
అదే, మీ నీడను
మీలో దాగిన
మీ శ్రీమతిని.

—మర్ల పద్మాశాస్త్రి

## సగటుమనిషి

ఆశల శిఖరాలను అందుకోవాలని
కోర్కెల నందనవనంలో విహరించాలని
కలల పంటలను పండించుకోవాలని
ఆశయాల పందిళ్ళలో పవళించాలని
నాకూ ఉంది; కానీ,
టెన్సింగునుకానినేను,
ఆశల శిఖరాలనెలా అందుకోను?
తోటమాలినైనా కాని నాకు
నందనవనమా?
ఇంటిపెరటిలో పాదులు
పెంచడానికైనా జాగా
లేని నాకు కలలపంటలా?
పందిరి వేయలేని నాకు
పందిళ్ళలో శయనమా?
పెరుగుతున్న జనాభాతో సంసారం
'అపోలో'లో వెడుతుంటే
నా చాలీచాలని జీతం నన్ను అగాధాల
లోనికి లాగుతుంటే
ఇక నాకు ఆశలూ, ఆశయాలూ
వీటికితోడు కోర్కెలూ, కలలూనా?
అదిగో అప్పుడే నన్నుచూసి
నవ్వుతున్నారుగా
నవ్వలేని నన్నుచూసి ఇంకా గట్టిగా
నవ్వండి!

—అల్లమరాజు అరుణశోభ

# పెరిగేవయసుకు ఆధారం
# కాల్షియం-శాండోజ్

## ఈ పెరిగే వయసుదాటితే,
## ఎంత కాల్షియం అయినాసరె
## వారి పెరుగుదలకు తోడ్పడదు!

మరీ ఆలస్యంకాకముందే మీ పిల్లలకు కాల్షియం-శాండోజ్ ఇవ్వండి.

ప్రపంచంలో అత్యుత్తమమైన కాల్షియం-శాండోజ్ వారిచే స్విట్జర్‌ల్యాండ్‌లో అభివృద్ధి పరచబడినది.

పిల్లల పళ్ళకూ, ఎముకలకూ, పెద్దలకన్న రెండింతలు కాల్షియం అవసరం. వారు దారుఢ్యంగా, బాగా పెరగాలంటే ఏడాది ఏడాదికీ వారికి ఎక్కువ కాల్షియం అవసరమౌతుంది.

వారికి కాల్షియం-శాండోజ్ బిళ్ళలు అవసరం. విటమిన్ సి, డి, బి 12లతో బలపరచబడి, రాస్ప్‌బెరీ రుచిగల్గి, మధురమైన కాల్షియం-శాండోజ్ బిళ్ళలు కనీసం రోజుకు 4 వారు చప్పరించేలా చూడండి.








**కాల్షియం-శాండోజ్®**

ప్రతి రోజు ప్రతివారికి

daCunha/CS/17 A Tel

దంటావా ?" సందేహం వచ్చింది అతనికి.

"ఎందుకు పిలవడు ? ఇప్పట్నించే ఆ అనుమానం ఎందుకు మనకు ?" తేల్చేసింది రుక్మిణి. ఒక నెలరోజులపాటు విడవకుండా వచ్చాడు రవి. ఆదివారాలయితే ప్రొద్దున్నే వచ్చేవాడు. సోమవారం ప్రొద్దున టిఫిన్ పెట్టి పంపించేది. రవికి సందడిగా తోడుగా వుండాలని చుట్టుప్రక్కల పిల్లల్ని పిలిచి కూర్చోబెట్టేది. వాళ్ళతోపాటే తనూ పసిపిల్లగా మారిపోయేది. ఆ పిల్లల్లో పిల్లలా కలిసిపోయేది. రోజు రోజుకి ఆమె దిగులు తగ్గుముఖం పట్టింది.

ఆ ముప్ఫయి రోజులూ రవి చేత 'అమ్మా' అని పిలిపించుకోవాలని ప్రయత్నిస్తూనే వున్నది రుక్మిణి. ఫలితం కనుపించలేదు. ఒక రోజు మాధవరావుతో, "రవితో ఇంత చనువుగా వున్న వాడు ఆంటీ అని తప్పితే అమ్మా అని పిలవటం లేదండీ. ఏం చేద్దామంటారు ?" అన్నది ఆమె దిగులుగా.

"ఇప్పుడే కదా కాస్త అలవాటయ్యాడు. రెండు మూడు నెలలుపోతే వాడే పిలుస్తాడు." ధైర్యం చెప్పాడు అతను. ఈ మధ్యనే రుక్మిణి బెంగని మర్చిపోయి కొంత ఉత్సాహంగా వుంటున్నది. ఆ ఉత్సాహంలో నీరు పొయ్యటం అతనికి ఇష్టంలేదు. స్తిమితపడింది రుక్మిణి మనసు.

ఒక శుభ ముహూర్తాన రవిచంద్రని దత్తత తీసుకుని, రుక్మిణీ, మాధవరావు తల్లీ తండ్రి అయ్యారు.

అమ్మా, నాన్నా అని పిలిపించుకోవాలని ఇద్దరూ తహతహలాడుతున్నారు. రవి మొదట్లో కొంచెం బెంగపెట్టుకున్నాడు. ఏదో విధాన దిగులును మరిపించి, ఏం కావాలో కొనిచ్చి, ఎంతో శ్రమతో అలవాటు చేసుకున్నారు.

రవిచంద్ర నవ్వితే నిండు పౌర్ణమిలా వుండేది రుక్మిణి మనసుకు. రవి ఏడుస్తుంటే కటిక చీకటిలో ప్రయాణంలా వుండేది రుక్మిణికి తన జీవితం. ప్రాణమంతా రవి మీద పెట్టుకొని బ్రతుకున్నది.

రుక్మిణి ప్రేమవాహినిలో రవి జీవిత నౌక సాఫీగా సాగిపోతున్నది.

*

ఆ రోజు ఇంటర్ మీడియట్ పరీక్ష ఫలితాలు వచ్చాయి.

రుక్మిణి ఆనందానికి అవధులు కన్పించలేదు.

రవి ఫస్ట్‌క్లాస్‌లో పాసవటం తన విజయంగా భావించాడు మాధవరావు.

గుంటూరు పంపించి ఎం. బి. బి. ఎస్ లో చేర్పించాలనుకున్నాడు.

"ఎం.బి. చదవటం నా కిష్టం లేదు అంకుల్ ! బి.కాం. లో చేరతాను." పేపరు చదువుకుంటున్న మాధవరావు దగ్గరికి వెళ్ళి తన అభిప్రాయం చెప్పాడు రవి.

"రవీ ! నువ్వు తెలివిగలవాడివి. నువ్వు డాక్టరివి కావాలని మా అందరి కోరిక. పెద్ద చదువు చదివి వృద్ధిలోకి రావాలని మేమెంతో ఆశపడుతున్నాము."

"మీ ఆశా, ఆశయం బాగానే వున్నాయి కాని, డాక్టర్ వృత్తికి నేను సరిపోను. అది నా కిష్టం లేదు. అదీగాక పొరుగూరు వెళ్ళి చదువుకోవాలి. అది కూడా నా కిష్టం లేదు. ఇక్కడయితే వారానికోసారైనా వెళ్ళి అమ్మనీ, అందర్నీ చూస్తుంటాను. ఈ ఊరు విడిచి వెళ్ళటం నా కసలు ఇష్టంలేదు !" తెగేసి చెప్పాడు రవి.

మనసులోనే నిట్టూర్చాడు మాధవరావు.

"నువ్విప్పుడు పెద్దవాడివయ్యావు. డిగ్రీ కోర్సులో చేరబోతున్నావు. ఏది మంచో ఏది చెడో తెలుసుకొనే విచక్షణాజ్ఞానం వస్తున్నది. చిన్నప్పటి నుంచీ మమ్మల్ని చూస్తున్నావు. నీ కోసమే, నువ్వు అమ్మా అని పిలిచే పిలుపుకోసమే బ్రతుకుతున్న ఆంటీని చూస్తున్నావు. ఒక్కసారి అమ్మా అని పిలవలేవా రవీ !" ప్రాధేయపడుతున్నట్టు అన్నాడు మాధవరావు.

"ప్రయత్నిస్తాను అంకుల్ ! నాకూ బాధగానే వున్నది. చాలా సిగ్గుగా కూడా వుంది. మీరు పెంచిన ఈ శరీరం మీ మాటా నా మాటా వింటుంది కాని....నా మనసు ఎవరి మాటా వినటం లేదు. నన్ను క్షమించండి !" తలవంచుకొని వెళ్ళిపోయాడు రవి.

రుక్మిణి కూడా చెప్పి చూసింది. "బంగారం లాంటి భవిష్యత్తుని పాడుచేసుకోకు. డాక్టర్ కోర్సు ఇష్టంలేకపోతే ఇంజనీరింగ్ అయినా చదువు" అని బ్రతిమిలాడింది.

"అంత పెద్ద చదువులు నా కిష్టం లేదు ఆంటీ ! బి.కాం. ఫస్ట్‌క్లాస్‌లో పాసై ఎమ్.కాం. చదివి లెక్చరర్ కావాలని నా కోరిక. ఈ విషయంలో మీరింకేం అడ్డు చెప్పొద్దు."

రవి అంత కచ్చితంగా చెప్పినందుకు రుక్మిణి ముందు బాధపడింది. చిన్నప్పట్నించీ అతని స్వభావమంతేగదా అని తర్వాత సర్దుకుంది.

"ఆంటీ !" అన్నప్పుడల్లా రుక్మిణి అమ్మ మనసు వుసూరుమనేది.

"ఏ జన్మలో పాపమో !" అని కుమిలిపోయేది.

రోజులు గడుస్తున్నకొద్దీ ఈ దిగులు ఎక్కువయింది రుక్మిణికి.

రవి ఇంట్లో లేని సమయం చూసి రుక్మిణిని కోప్పడ్డాడు మాధవరావు.

"కోరికే అన్ని బాధలకు మూలం రుక్మిణీ ! ఏ కోరికనూ నీ మనసులోకి రానీయకు."

"నాకే కోరికా లేదండీ !.... ఆ ఒక్క...."

"చూడు రుక్మిణీ ! రవి పెద్దవాడవుతున్నాడు. మన బాధ గమనిస్తున్నాడు. పిలవలేనందుకు వాడూ బాధపడ్తూనే వున్నాడు. ఏదో ఒక మంచి రోజున మనిద్దర్నీ అమ్మా నాన్నా అని మనస్ఫూర్తిగా పిలుస్తాడని నేను వాడి మీద కొండంత ఆశ పెట్టుకున్నాను. ఆశే కదా మనిషిని నడిపించేది..." అని నెమ్మదిగా నచ్చజెప్పాడు.

అప్పటికి దుఃఖాన్ని దిగమింగింది రుక్మిణి.

*

అనసూయ దగ్గరకు ప్రతి ఆదివారం ప్రొద్దున్నే వెళ్ళిపోతాడు రవి. సోమవారం ఉదయం అట్నుంచి అటే కాలేజీకి వెళ్ళి సాయంత్రం తిరిగి వస్తాడు.

మంచి ఇల్లొకటి అమ్మకానికి వస్తే వెంటనే కొనేశాడు ప్రకాశరావు.

పెద్దకూతురికి పెళ్ళి చేశారు. అనసూయా, ప్రకాశరావు ముఖాల్లో ముసలితనం ముద్ర వేసింది. పెద్దకొడుక్కి గూడా సంబంధాలు చూస్తున్నారు.

రవి వెళ్ళినప్పుడల్లా ఇద్దరూ హెచ్చరిస్తూనే వున్నారు.

"రవీ ! ఆంటీని ఏమని పిలుస్తున్నావు ? ఆయన్ని అంకుల్ అనటం మానేశావా ?" ప్రకాశరావు కోపంగా అడిగాడు ఆ రోజు.

"ఇంకా లేదు నాన్నగారూ ! మీరు చెప్పినప్పుడల్లా నేను పిలవాలనే అనుకుంటాను. తీరా వాళ్ళను చూడగానే మీరు గుర్తుకొస్తారు. ఆంటీ అంకుల్ అనే నా నోట్లోంచి వస్తున్నది. నన్నేం చెయ్యమంటారు ?"

అమాయకంగా ముఖంపెట్టి అడుగుతున్న కొడుకు మీద కోపాన్ని చూపించలేక అవతలికి వెళ్ళిపోయాడు ప్రకాశరావు.

అన్నం పెడ్తూ అనసూయ అడిగింది: "అమ్మనీ నాన్ననీ కూడా రమ్మనకపోయావా? నువ్విటువస్తే వాళ్ళకిమటుకు ఏం తోస్తుంది?"

"ఏ అమ్మా, ఏ నాన్నా?" విసుగ్గా అడిగాడు రవి.

"అదేమిట్రా రవీ! ఎందుకంత విసుగు? కన్నతల్లి కంటె మిన్నగా చూసుకుంటున్నది రుక్మిణి. ఆ దేవతను అమ్మా అని పిలవలేవూ?" మందలింపుగా అన్నది.

"ఒక అమ్మకి ఇద్దరు కొడుకులుంటారు గాని...ఒక కొడుక్కి ఇద్దరమ్మలుంటారా?" ఎగతాళిగా నవ్వుతూ అన్నాడు రవి.

"ఒరేయ్! నీ తెలివితేటలు కట్టిపెట్టి....నేను చెప్పింది విను. అనుకుంటే ప్రతి ఆడదీ అమ్మే అవుతుందిరా! స్త్రీ హృదయం అమృతభాండం రవీ! అందులో సదా ప్రేమ వూరుతూనే వుంటుంది. అది తల్లిగా అందరికీ పంచుతూనే వుంటుంది. కంటేనే కడుపు కాదురా! కళ్ళల్లో పెట్టుకొని పెంచుతున్నదే....ఆ మాతృమూర్తి నీకు అమ్మకంటే ఎక్కువరా! నువ్వు ఇంటికి వెళ్ళగానే చెయ్యాల్సిన మొదటి పని....రుక్మిణిని అమ్మా అని పిలవటం. తెలిసిందా....?" గట్టిగా అన్నది అనసూయ.

"ఆఁ తెలిసిందిలే!" నిర్లక్ష్యంగా అన్నాడు రవి.

"నువ్వు ఆంటీ, అంకుల్ అని పిలవటం మానేస్తేనే ఇక్కడికిరా! లేకపోతే రావటం మానేయ్!" కోపంగా అన్నది.

"పోనీ! మమ్మీ డాడీ అని పిలవనా?" కొంచెం ఆలోచించి అన్నాడు.

"మమ్మీలు టామీలు వద్దుగానీ....చక్కగా నోరారా అమ్మా అని నన్ను పిలుస్తున్నట్లు పిలవరా" ప్రాధేయ పూర్వకంగా అడిగింది అనసూయ.

"అయితే నిన్ను పిలవటం మానేసి ఆంటీనే అమ్మా అంటాలే! అలా పిలవలేకపోతే మీ ఇంటికి రానులే!" రోషంగా అన్నాడు రవి.

అనసూయ మాట్లాడలేదు.



నిమ్మపండుమ పిండాక ఆ మిగిలిన తొక్కలను భద్రం చేసి ఉంచి స్నానం చెయ్యడానికి ఉపయోగించే నీటిలో వేసి కాచి ఆ నీటితో స్నానం చేస్తే ఉత్సాహంగా ఉంటుంది.

"అసలు నేనంటే నీ కిష్టం లేదు. నాన్నగారి క్కూడా ఇష్టం లేదు. అందుకే ఆంటీ వాళ్ళింట్లో నన్ను పడేశారు. అంత ఇష్టం లేనప్పుడు నన్నెందుకు కన్నారు?" కంచంలో చేయి కడుక్కొని, కళ్ళల్లో నీరు తిరుగుతుంటే తలవంచు కున్నాడు రవి. ఇన్నాళ్ళూ రవిచంద్ర చిన్నవాడనే అనుకుంటున్నది అనసూయ. ఈ పెద్దమాటలు విని తెల్లబోయింది: "ఆ మాటలేమిట్రా రవీ! పెద్ద వాళ్ళతో మాట్లాడటం ఇలాగేనా? నువ్వంటే ఇష్టం లేక కాదు నాయనా! ఆంటీ బాధ చూడ లేక....అది పడే ఆవేదన చూసి...."

"ఓహో! ఎవరైనా నీ దగ్గరికొచ్చి బాధ పడితే వెంటనే పిల్లల్ని ఇచ్చేస్తావనన్న మాట. నన్ను వాళ్ళకి ఇచ్చావు. ఇంకా ఇద్దరు ముగ్గురు అడిగుంటే....అందరికి ఇచ్చేసి పెద్దన్నయ్యను ఒక్కడినీ నువ్వు పెంచేదానివన్న మాట!" వ్యంగ్యంగా అన్నాడు.

"రవీ!" కోపంతో గట్టిగా అరిచాడు ప్రకాశరావు. "అమ్మను ఎంతమాట పడితే అంత మాట అంటావా?" అంటూ చెయ్యెత్తాడు.

"ఆగండి!". అతి ప్రయత్నం మీద భర్త చేతిని క్రిందికి దించింది అనసూయ.

"రవీ! ఆఖరుసారిగా చెబుతున్నాను విను. వాళ్ళని అమ్మా నాన్నా అని పిలుస్తేనే ఇంటికిరా! లేకపోతే రావటం మానెయ్యాలి." హెచ్చ రిస్తున్నట్టు అన్నాడు ప్రకాశరావు.

రవి "అయితే....మొదటిసారిగా నేను చెప్పేది వినండి. వాళ్ళని అలా పిల్చి మిమ్మల్ని ఆంటీ అంకుల్ అని పిలుస్తాను. ఒప్పుకుంటారా?" అని అడిగాడు.

నోట మాట రానట్లు నిశ్చేష్టులయ్యారు వాళ్ళు.

"ఆలోచించుకొని ఏ సంగతీ రేపు నేను కాలేజీకి వెళ్ళేలోపల చెప్పండి." వాళ్ళిద్దర్నీ వంటింట్లో వదిలేసి క్రికెట్ ఆడుకోవడానికి వెళ్ళి పోయాడు రవిచంద్ర. అప్రయత్నంగానే ముఖ ముఖాలు చూసుకున్నారు అనసూయ, ప్రకాశరావు. కళ్ళజోడు తుడుచుకుంటూ ప్రకాశరావు వాకిట్లోకి, కళ్ళు తుడుచుకుంటూ అనసూయ పెరట్లోకి వెళ్ళారు.

పడుకోబోయే ముందు అనసూయని అడిగాడు ప్రకాశరావు: "రేపు రవికి ఏం చెబుతాము?"

"ఏమోనండీ! ఏం చెప్పాలో తోచడం లేదు. అయినా వీడింత మొండిగా తయారయ్యాడు ఏమిటి?" దిగులుగా అన్నది.

"ఇంకా చిన్నతనం కదా అనసూయా! కొన్నాళ్ళు పోతే వాడే సర్దుకుంటాడు. మనమే ఆంటీ అంకుల్‌గా మారిపోదామా?" భార్య ముఖంలోకి పరీక్షగా చూస్తూ అన్నాడు. ఉలిక్కి పడింది అనసూయ: "ఇన్నాళ్ళూ అమ్మనై ఇప్పుడు ఆంటీ నేమిటండీ!" బాధగా అన్నది.

"పిలిపించుకోడానికే నువ్వింత ఆలోచిస్తుంటే పిలవటానికి వాడెంత బాధ పడాలి? ప్రొద్దున వాడిమీద చెయ్యెత్తిన దగ్గిర్నుంచి నాకు సిగ్గుగానే వున్నదనుకో! నా మీద నాకే అసహ్యమేస్తున్నది. ఇంకా వాడు నా మీద గౌరవముంచి అలా నిలబడ్డాడు గాని....'చెయ్యి దించండి నాన్నగారూ' అని ఉంటే మన మర్యాద, పెద్దరికం ఏం నిలిచేవి? అందుకే ఈ కాలపు తండ్రులు చాలామంది పిల్లలతో స్నేహంగా వుండి వాళ్ళతో మంచిగా మాట్లాడి వాళ్ళ మర్యాద వాళ్ళు దక్కించు కుంటున్నారు."

"నన్ను పిలిస్తే రుక్మిణిని పిలవకూడదా? ఆయన్ని పిలిస్తే మిమ్మల్ని పిలవకూడదా? దత్తత ఇచ్చేటప్పుడు ఇవన్నీ ఆలోచించలేదు మనం. రుక్మిణి దిగులుతీరితే చాలనుకున్నాము. ఇప్పుడే సమస్యలన్నీ వచ్చి పడ్డాయి. ఏం చేద్దామంటారు?"

"గతం నాస్తి! జరిగిపోయింది. ఇప్పుడు మనమే ఆంటీ అంకుల్‌గా మారటం మంచిదను కుంటున్నాను. కాలేజీకి వెళ్ళేటప్పుడు ఆ సంగతే చెప్పు."

"అయినా వీడికింత పట్టుదల ఎందుకండీ?"

"మూర్ఖులకు ఎవరు చెప్పగలరు అనసూయా?" నిట్టూర్చాడు అతను. ఆలోచనలు చాలు గాని ఇంక నిద్రపో!"

ఒకరికి తెలియకుండా ఒకరు నిద్రమాత్రలు వేసుకుని పడుకున్నారు. [సశేషం]

ఈ రంగుల పేజీ వనిత పాఠకులకు చిన్న 'దీపావళి' కానుక. ఈ పేర్లన్నీ వంట దినుసులకు ఉపయోగపడే పేర్లు. వీటిని ఒక్కొక్కటిగా—గీత మీద నుంచి కత్తిరించి, ఆయా డబ్బాల మీదనో, సీసాల మీదనో అతికించి వుంచుకుంటే—కావలసిన వస్తువు కోసం తడువుకోనక్కర్లేదు. మరి, కత్తిరించండి!

| | | |
|---|---|---|
| మిరపకాయలు వనిత | మసాలా పొడి వనిత | మినప పప్పు వనిత |
| పంచదార వనిత | చారు పొడి వనిత | పెసర పప్పు వనిత |
| మిరియాలు వనిత | సాంబారు పొడి వనిత | వంట సోడా వనిత |
| జీలకర్ర వనిత | ధనియాలు వనిత | వాము వనిత |
| మెంతులు వనిత | మెత్తని ఉప్పు వనిత | గోధుమ పిండి వనిత |
| ఆవాలు వనిత | శొంఠి పొడి వనిత | మైదా పిండి వనిత |
| కారపు పొడి వనిత | కంది పప్పు వనిత | సగ్గు బియ్యం వనిత |
| పసుపు పొడి వనిత | సెనగ పప్పు వనిత | సెనగ పిండి వనిత |

# 20 సూత్రాల బొమ్మల కొలువు

మద్రాసులోని త్యాగరాయనగర్‌లో నివసిస్తున్న శ్రీమతి కణ్ణన్ అనే ఆవిడ–దసరాకు బొమ్మలకొలువు పెట్టారు. విశేషం ఏమిటంటే–20 సూత్రాల పథకాన్ని వివరిస్తున్న బొమ్మలతో పెట్టారు – ఆ కొలువు అనేకులను ఆకర్షించింది. ఇక్కడ వున్న ఛాయా చిత్రాలు ఆ కొలువు లోని కొన్ని:




























'అమ్మా! నా పెన్సిలు ఎక్కడో కనిపించడం లేదు!' అని పిల్లలు తమ తల్లిని అడపాదడపా అడుగుతూ ఉండవచ్చు. 'పాలఖర్చు లెక్క వెయ్యడానికి కలం ఎక్కడపోయిందో తెలియడం లేదు!' అని విచారించే గృహిణులూ ఉండవచ్చు. ఇటువంటి సమస్యలకు పరిష్కారం- పెన్సిళ్ళూ కలాలూ ఉంచుకోడానికి ఉపయోగపడే పెన్సిల్ హోల్డర్లు. ఈ పెన్సిల్ హోల్డర్లు బజారులో దొరుకుతాయి. అయినా ఆసక్తిగలవారు వీటిని ఇంట్లోనే తయారు చేసుకోవచ్చు. అలా ఇంట్లోనే తయారు చెయ్యదగ్గ రెండు రకాలైన పెన్సిల్ హోల్డర్ల నిర్మాణం గురించి ఇక్కడ తెలుసుకుందాము.

మొదట గవ్వలు ఉపయోగించి రూపొందించదగ్గ పెన్సిల్ హోల్డర్ గురించి తెలుసుకుందాము.

ఇది చెయ్యడానికి చిన్న సైజు టిన్ను ఒకటి, $\frac{1}{2}$ మీటరు నలుపు రంగు 'రిక్‌రాక్' (కాటన్ లేస్). 15 గవ్వలు, నలుపురంగు ఎనామెల్ పెయింట్, వృత్తాకారంలో ఉండే చిన్న అద్దం ముక్కలు మూడు, $\frac{1}{4}$ మీటర్ పసుపురంగు గుడ్డ, ఫెవికాల్ జిగురూ అవసరం.





మొదట టిన్ను లోపలి భాగానికి నలుపురంగు ఎనామెల్ పెయింటు పుయ్యాలి. పెయింటు ఎండాక దాని వెలుపలి భాగాన ఫెవికాల్ జిగురు పట్టించాలి.

తర్వాత అలా పట్టించిన ఫెవికాల్ మీద పసుపురంగు వెల్వెట్ గుడ్డను ఉంచి టిన్ను చుట్టూ అతకాలి. ఇలా అతుకుతున్నప్పుడు టిన్ను కింది అంచునుంచి ప్రారంభించి అతుకుతూ, మీది భాగాన మిగిలిపోయిన గుడ్డను అలాగే లోపలికి మడిచి లోపలి భాగాన అతకాలి.

నలుపురంగు కాటన్ లేసును టిన్ను మీది భాగాన, కింది భాగాన 58 వ పేజీలో ఎడమవైపున ఉన్న వర్ణచిత్రంలో చూపినట్లు అతకాలి. తర్వాత టిన్నుమీది భాగాన మధ్యగా వృత్తాకారపు అద్దం ముక్కను అతికి, పిదప ఆ అద్దం చుట్టూ ఐదు గవ్వలను పూలరేకుల ఆకారంలో వచ్చేలా అతకాలి. ఇలా తక్కిన రెండు అద్దాలనూ అతికి, వాటి చుట్టూ గవ్వలు అతికి మరి రెండు పువ్వులు తయారు చెయ్యాలి.

58వ పేజీలో ఎడమవైపునగల వర్ణ చిత్రం చూస్తే ఈ పెన్సిల్ హోల్డర్ తయారైతే ఎలా ఉంటుందో స్పష్టం కాగలదు.

తమాషా అయిన పువ్వులతో ఒక పెన్సిల్ హోల్డర్ రూపొందించి చూద్దామా ?

ఈ పెన్సిల్ హోల్డర్ చెయ్యడానికి ఒక చిన్న టిన్ను, ¼ మీటర్ ముతక గుడ్డ (వీలుంటే వెల్వెట్ కార్డ్రాయ్), నలుపురంగు ఎనామెల్ పెయింట్, ఫెవికాల్, పచ్చరంగు ఫెల్టు; పసుపు, నీలం, గులాబీ, వయొలెట్ రంగుల ఫెల్టు ముక్కలు కావాలి.

మొదట టిన్ను లోపలి భాగానికి నలుపురంగు ఎనామెల్ పెయింటు పుయ్యాలి. పెయింటు ఎండాక దాని వెలుపలిభాగాన ఫెవికాల్ జిగురు పట్టించాలి.

తర్వాత అలా పట్టించిన ఫెవికాల్‌మీద టిన్ను చుట్టూ (టిన్ను కింది అంచు నుంచి ప్రారంభించాలి) ముతకగుడ్డ అతకాలి. టిన్ను మీది భాగాన మిగిలిపోయిన గుడ్డను టిన్ను లోపలికి మడిచి లోపలి భాగాన అతకాలి.

పచ్చరంగు ఫెల్టును తీసుకుని దాన్ని పొడవైన సన్నని ముక్కలుగా కత్తిరించుకోవాలి. ఇలా కత్తిరిస్తున్నప్పుడు ఆ ముక్కలు వేర్వేరు పొడవుల్లో ఉండేలా చూసుకోవాలి. ఆ తర్వాత ఆ ముక్కలను తీసుకుని టిన్ను చుట్టూ 58 వ పేజీలో కుడివైపు ఉన్న వర్ణచిత్రంలో చూపినట్టు అతకాలి.

ఇక్కడ విడిగా ఇచ్చిన పువ్వుల డిజైన్లను ట్రేస్ చేసుకుని పసుపు, నీలం, గులాబీ, వయొలెట్ రంగుల ఫెల్టు ముక్కలను ఆ పువ్వుల ఆకారంలో కత్తిరించి తీసుకోవాలి. ఈ పువ్వులను







ముందుగా టిన్ను చుట్టూ అతికిన పచ్చరంగు ఫెల్టు ముక్కలమీద అతకాలి. ఇలా అతికితే ఈ పెన్సిల్ హోల్డర్ పూర్తవుతుంది.

వర్ణచిత్రం చూస్తే ఈ పెన్సిల్ హోల్డర్ తయారయ్యాక ఎలా ఉంటుందో తెలుస్తుంది.

అందమైన ఈ పెన్సిల్ హోల్డర్లలో పెన్సిళ్ళూ కలాలూ ఉంచి ఇంట్లో ఏ బల్లమీద పెట్టినా అవసరం వచ్చినప్పుడు వాటిని తీసుకోవడానికి సదుపాయంగా ఉంటుంది. పెన్సిళ్ళతో కలాలతో బాటు ఈ పెన్సిల్ హోల్డర్లలో అందమైన ప్లాస్టిక్ పువ్వులు అమర్చి ఉంచితే—ఇంటికి అందమూ, ఆకర్షణ కూడా కలిసి వస్తాయి ! *



లండన్‌లో ఆ మధ్య ఒక అందమైన అమ్మాయిని పట్టుకున్నారు. సరైన పాస్‌పోర్టులు లేకుండా దొంగచాటున భారతదేశం, పాకిస్తాన్, వెస్టిండీస్ వంటి దేశాల నుంచి ఇంగ్లండుకు వచ్చిన యువకులను పెళ్ళాడడం ఆమె వృత్తి. అలా పెళ్ళాడితే తాము బ్రిటిష్ పౌరులు కావచ్చునన్న ఆశతో వారు ఆమెకు నూరు పౌన్లు (దాదాపు 1800 రూపాయలు) ఇచ్చుకునేవారు. ఆ డబ్బు తీసుకుని ఆమె పెళ్ళయిన తక్షణం మాయమయ్యేది. అలా ఏడునెలలలో 50 మందిని వివాహమాడిందట-ఆమె. అయితే ఆమెను పెళ్ళాడినవారికి బ్రిటిష్ పౌరులయ్యే వీలు మాత్రం దొరకలేదు. ఎంచేత ? వాళ్ళు కూడా ఖైదు కాబడ్డం చేత !

ఆడపిల్లలను బజారులో వేళాకోళం చెయ్యడం, అల్లరి పట్టించడం (దీన్నే ఈవ్‌టీజింగ్ అంటారు) చట్టం ప్రకారం నేరాలు. ఆ నేరాలు చేసిన పురుషులను పోలీసులు ఖైదు చేసి కేసులు పెడుతూ ఉంటారు.

ఇటీవల తమిళనాడులోని కోయంబత్తూరులో ఏడుగురు స్త్రీలను (25 సంవత్సరాల నుంచి 35 సంవత్సరాల ప్రాయంలోవారిని) పోలీసులు అరెస్టు చేశారు. కారణం ? ఆ స్త్రీలు — ఇద్దరు యువకులను నడి బజారులో అనవసరంగా వేళాకోళం చేశారట !

# డాక్టర్ చెప్పిన జవాబులు



స్త్రీల జీవితాలలో ఋతుస్రావం, పిల్లల కాన్పు, పిల్లల పెంపకం వంటివి రకరకాల సమస్యలు కలిగిస్తుంటాయి. వాటికి సంబంధించిన కొన్ని ప్రశ్నలకు ఒక లేడీ డాక్టర్ సమాధానాలిచ్చారు. 'డాక్టరమ్మావిన్ బదిల్ గళ్' అన్న తమిళ పుస్తకంలో చోటు చేసుకున్న ఆ ప్రశ్నలు కొన్నిటినీ, వాటి జవాబులనూ ఇక్కడ ప్రచురిస్తున్నాము. 'వనిత' పాఠకులకు ఇవి ఉపయోగపడగలవని ఆశిస్తున్నాము.

## ఋతుస్రావం

**ఋతుస్రావం (ముట్టు) రావడం గురించి ఆడపిల్లలు చిన్నవారుగా ఉన్నప్పుడే తెలియజేయడం మంచిదా?**

మంచిదే. ఋతుస్రావం రాగల ప్రాయంలో ఉన్న బాలికలకు దాని గురించి తెలియజేయడం అవసరం కూడా. 'ఋతుస్రావం అంటే ఏమిటి? అది మొదట ఎటువంటి గుర్తులతో కనిపిస్తుంది?' అన్న వాటిని ముందే వివరిస్తే తర్వాత ఆ బాలికలు భయపడడానికి ఆస్కారం ఉండదు.

**ఋతుస్రావం జరుగుతున్న కాలంలో ఆహార విషయంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలా?**

ఋతుస్రావం జరుగుతున్న కాలంలో మిరపకాయలు, మిరియాలు, ఆవాలు, లవంగం వంటి కారపు పదార్థాలను ఉపయోగించకుండా ఉంటే మంచిది. అవి పొత్తి కడుపులోని భాగాలకు ఎక్కువ రక్తాన్ని ప్రవహించేలా చేసి ఋతుస్రావం జరిగేటప్పుడు వెలువడే రక్తాన్ని అధికం చేస్తుంది. మసాలా పదార్థాలను చేర్చుకోకుండా ఉన్నా మంచిదే.

**ఋతుస్రావ సందర్భంలో ఎక్కువ రక్తం వెలువడడం అపాయకరమా?**

అవును. ప్రతి నెలా దాదాపు 8 ఔన్సుల పరిమితిలో ఉంటే ఫరవాలేదు. అంతకన్నా ఎక్కువైతే ఆయాసం రావడం, అలసట కలగడం, శరీరం చిక్కడం వంటివి జరగవచ్చు. అందువల్ల జీవితం ఉత్సాహంగా ఉండదు.

**ఋతుస్రావం జరుగుతున్నప్పుడు కొందరు స్త్రీలు స్నానం చెయ్యకుండా ఉండి మూడు రోజుల తర్వాత స్నానం చేస్తారు. ఇది సరైనదేనా?**

ఇలా చెయ్యడం సరైనదికాదు. ఋతుస్రావ సమయంలో రోజూ రెండు సార్లయినా స్నానం చెయ్యాలి. అప్పుడు స్త్రీలు జననాంగాన్ని పరిశుభ్రంగా ఉంచుకోవాలి. పరిశుభ్రమైన గుడ్డలు ఉపయోగించాలి. లేకుంటే రోగక్రిములు శరీరంలోకి వ్యాపించే అవకాశం ఉంటుంది.

**ఋతుస్రావం అందరిలోనూ ఒకే రకంగా ఉండదట కదా?**

ఆయా స్త్రీల ఆరోగ్యం, శరీర తత్త్వం వంటి వాటిని బట్టి ఋతుస్రావం 21, 28, 30 రోజులకొకసారి ఏర్పడవచ్చు. ఈ రోజుల లెక్క ఏదైనంత వరకు ప్రతి నెలా ఒకే తీరుగా ఉండాలి. ఎక్కువ రోజులు తేడావస్తే ఒంట్లో ఏదో సరిగాలేదని అర్థం.

**ఋతుస్రావం ఆగిపోవడానికి ఫలానా వయసంటూ నియమమేదైనా ఉందా?**

త్వరగా పుష్పవతి అయిన స్త్రీకి ఋతుస్రావం త్వరగానే ఆగిపోవచ్చు. ఆలస్యంగా పుష్పవతి అయిన స్త్రీ ఋతుస్రావం ఆలస్యంగా ఆగవచ్చు.

**ఋతుస్రావం ఆగిపోయేటప్పుడు స్త్రీల స్వభావంలో మార్పు ఏదన్నా వస్తుందా?**

వస్తుంది. అప్పట్లో వారు చిరచిరలాడుతూ మండిపడుతూ ఉంటారు. వారికి అడపా తడపా తలనొప్పి, వాంతులు, మైకం వంటివి రావచ్చు. కోడళ్ళ మీద అత్తలు మండిపడి కయ్యానికి కాలు దువ్వడానికి ఋతుస్రావం ఆగిపోతూండడం కూడా ఒక కారణం కావచ్చును.

## పిల్లల కాన్పు

**కాన్పు సమయంలో వచ్చే నొప్పినిబట్టి కాన్పు ఎంత సేపట్లో అవుతుందో తీర్మానించే వీలుందా?**

మొట్టమొదటిసారిగా గర్భవతి అయిన స్త్రీలలో కాన్పు నొప్పి దాదాపు 18 గంటలసేపు ఉండవచ్చును. గర్భాశయం ముడుచుకు పోవడంవల్ల ఈ నొప్పి వస్తుంది. ఈ నొప్పి 30 నిమిషాలకొకసారి వస్తే ఆ గర్భవతి తొందరపడనక్కరలేదు. నొప్పి 10 నుంచి 15 నిమిషాలకొకసారి వస్తే ఎంత త్వరగా ఆస్పత్రికి తీసుకువెడితే అంత మంచిది.

**కాన్పు వచ్చినప్పుడు కొన్ని జబ్బులు నయమవుతాయనడం నిజమేనా?**

నిజమే. స్త్రీల జబ్బులు కొన్నీ, రక్తపు పోటుకు సంబంధించిన కొన్ని రకాల జబ్బులూ, చిత్తచాంచల్యం వంటివీ చాలావరకు కాన్పు సందర్భంగా తగ్గుతాయి.

**25 నుంచి 30 ఏళ్ళ ప్రాయంలో మొదటిసారిగా గర్భవతులైతే ఆ స్త్రీల కాన్పు కష్టంగా వుంటుందంటారు. అది నిజమేనా?**

నిజమే. 25 ఏళ్ళ ప్రాయం వచ్చేసరికి నడుము ఎముక బాగా గట్టి పడుతుంది. కనుక కాన్పు సమయంలో దాని బిగువు సడలదు. అలా కాన్పు కష్టమవుతుంది. చాలామందికి శస్త్రచికిత్స అవసరమవుతుంది. కనుక 16 ఏళ్ళు వచ్చేలోగా పెళ్ళాడి తల్లులు కావడమూ, 30 ఏళ్ల మీద పడ్డాక పెళ్ళి చేసుకొని తల్లులు కావడమూ కూడా శ్రమతో కూడినవే.

## పిల్లల పెంపకం

**పాలు తాగే పాపాయి ఉండగా—తల్లికి మళ్ళీ గర్భం వస్తే ఆ పాపాయికి తల్లి పాలు ఇవ్వవచ్చా?**

ఇవ్వకూడదు. అలా ఇస్తే తల్లి ఆరోగ్యం చెడుతుంది.

**తల్లికి జలుబు, జ్వరం వంటి సాధారణమైన జబ్బులు ఉన్నప్పుడు బిడ్డకు తన పాలు ఇవ్వవచ్చా ?**

జలుబు, జ్వరం ఉన్న తల్లి తన బిడ్డలకు పాలు ఇవ్వడంలో తప్పేమీలేదు. తల్లికి అంటు వ్యాధు లేవైనా వచ్చినప్పుడు మాత్రం బిడ్డలకు పాలు ఇవ్వకూడదు.

**తల్లి బిడ్డకు పాలిచ్చేముందు కొన్ని చుక్కల పాలను ముందే అవతలికి చిందాలంటారు. ఇలా చెయ్యడం అవసరమా ?**

అవసరమే. క్రిములేవన్నా క్షీరనాళాలలోకి వెళ్ళి ఉండవచ్చు. అందువల్ల బిడ్డకు పాలిచ్చేముందు కొన్ని చుక్కల పాలను అవతలికి చింది, అలా ఆ క్రిములను తొలగించవచ్చును.

**ఆహారం తీసుకున్నాక పాపాయికి వెక్కిళ్ళు వస్తాయి. అప్పుడు ఏం చెయ్యాలి ?**

తొలి నెలలలో చాలామంది పాపాయిలకు ఆహారం ఇచ్చాక వెంటనే వెక్కిళ్ళు వస్తాయి. కడుపులో గాలి చేరి ఉండే పాపాయిని భుజాన వేసుకుని త్రేన్చేలా చెయ్యాలి. లేదా కాస్త వేడి నీళ్ళు ఇవ్వవచ్చు. ఇంతకన్నా మరేమీ చెయ్యక్కరలేదు. ఈ వెక్కిళ్ళ గురించి బాధపడనక్కరలేదు.

**పాపాయికి అడపాదడపా జలుబు రావడానికి పాపాయి మనస్తత్వానికీ సంబంధం ఉందంటారు. అది నిజమేనా ?**

నిజమే. విచారం గానీ, భయం గానీ ఉన్నప్పుడు పిల్లలకు జలుబుచేసే అవకాశం ఉందని మనస్తత్వ శాస్త్రవేత్తల అభిప్రాయం.

**పక్కలోనే మూత్ర విసర్జన చేసే పిల్లలను ఆ అల వాటు నుంచి తప్పించడం ఎలా ?**

ఆత్మవిశ్వాసమూ, చాలినంత ధైర్యమూ లేని పిల్లలు నిద్రపోతున్నప్పుడు తమకు తెలియకుండానే పక్కలో మూత్ర విసర్జన చేస్తారు. బాగా అదుపులో ఉంచిన పిల్లలు కూడా ఇలా చేస్తుంటారు. కనుక పిల్లలను ఎక్కువగా అదుపులో పెట్టకుండా వారికి ఆత్మవిశ్వాసం కలిగేలా చెయ్యడం ద్వారా ఈ అలవాటును మాన్పవచ్చు. □



జమ్మలమడుగు 'కాంప్‌బెల్' ఆసుపత్రిలో పనిచేసె ఒక నర్సుకు-స్కాలర్‌షిప్ వచ్చి, అమెరికాలో శిక్షణ పొంది వచ్చింది. ఈ స్కాలర్‌షిప్‌ను ఫిలిప్ మారిస్ ఇంటర్నేషనల్ వారు ఏర్పాటు చేశారు. ఆమె శ్రీమతి పెసల. భర్త 'వైద్యార్థి'. ఆమె జమ్మలమడుగులోని కాంప్‌బెల్ ఆసుపత్రిలో నర్సుగా ఎనిమిదేళ్లుగా పని చేస్తున్నది. ఇప్పుడామె 'కమ్యూనిటీ హెల్త్ నర్సింగ్ ట్యూటర్'. ఈ సంవత్సరంలోనే ఆమె నెల్లూరులోని 'నర్సింగ్ కాలేజీ' లో చదివి "డిప్లొమా ఇన్ టీచింగ్" సంపాదించింది. అంతకుముందు, ఒంగోలులోని 'క్లౌ మెమోరి యల్ హాస్పిటల్ స్కూల్ ఆఫ్ నర్సింగ్' ద్వారా నర్సింగ్, మిడ్ వైఫరీలలో సర్టిఫికేట్స్ సంపాదించింది. ఈ అర్హతలవల్ల-శ్రీమతి పెసలకు స్కాలర్‌షిప్ లభించింది: అట్లాంటాలోని ఎమోరీ యూనివర్శిటీ ఇంటర్నేషనల్ నర్సింగ్ సెంటర్‌లో శిక్షణ పొందే అవకాశం లభించి, మూడు మాసాలు శిక్షణ పొంది తిరిగి వచ్చింది. ఇంకా ఘనత ఏమిటంటే, ఈ స్కాలర్‌షిప్ తెలుగు వనితకు లభించడం.

Edited & Published by B. Viswanatha Reddi for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop.




# "లోధ్ర" టానిక్

# వనితలకు మాత్రం!

ప్రకృతి సిద్ధమైన పద్ధతి ద్వారా ఆరోగ్యంగా ఉండడానికీ
నెలలో ప్రతిరోజూ బాధలేని రోజుగా గడపడానికీ
"లోధ్ర" టానిక్ తీసుకోండి! ఏ బాధా లేకుండా ఆరోగ్య
మయమైన జీవితాన్ని గడపండి.

75 సంవత్సరాల నుంచీ స్త్రీల విశ్వాసానికి
పాత్రమైన టానిక్.
"లోధ్ర" మందుల షాపులలో దొరుకుతుంది.

Sistas

ఉచితమైన వైద్య సలహాలకు క్రింది చిరునామాకు ఈ కూపనును పూర్తిచేసి, మీ ఉత్తరంతోబాటు జతచేసి పంపండి.

పేరు : ______________________

చిరునామా : ______________________

______________________

______________ PIN ______________

## కేసరి కుటీరం (ప్రై) లిమిటెడ్

15, వెస్ట్‌కాట్ రోడ్, రాయపేట, మద్రాసు-600 014

ఏజంట్లు: శీతారామ జనరల్ స్టోర్స్ ఏజన్సీస్, విజయవాడ, సికింద్రాబాదు, బెంగళూరు

---

# ఫోస్‌ఫోమిన్ ఐరన్

కుటుంబం కోసం... ప్రేమానురాగం, సంతోషం, సంరక్షణ



మరి తన కోసం...

## ఫోస్‌ఫోమిన్ ఐరన్

**స్త్రీల కోసం....ప్రత్యేకంగా**
**రూపొందించబడిన టానిక్**




ఆరోగ్యకరమైన ఎర్రని రక్తకణాలను పెంపొందింప చేస్తుంది...శక్తిని తిరిగి ప్రసాదిస్తుంది, దారుఢ్యమును పెంపొందిస్తుంది, శరీరము యొక్క రోగనిరోధక శక్తిని బలపరుస్తుంది.

**నియమానుసారంగా**
**ఫోస్‌ఫోమిన్ ఐరన్ సేవించండి.**

**SARABHAI CHEMICALS LTD.**

Shilpi SC 3A/76 tel





ఈ దీపావళికి

## పి. బి. లక్ష్మణ సా వారి

## పట్టు చీరెలు

ఒక ప్రత్యేకత

## పి. బి. లక్ష్మణ సా & బ్రదర్స్

(ఏర్‌కండిషన్డ్)



పానగల్ పార్క్, టి. నగర్, మద్రాసు-600 017

చింతాద్రిపేట, మద్రాసు-600 002

తయారుచేయబడు చోటు :

15, మెట్టు వీధి, కాంచీపురం







1. సాంసాయ్ డిజైన్



2. శివా డిజైన్



3. అబ్బక్కోళి డిజైన్